

చందమామ
మార్చ్ 1996
5

# ANNOUNCING THE



**The first six books, splendid in their content, press,, marking the Golden Jubilee of Chanda**




A novelette on three lads befriending an unusual stranger – and their strange adventure, in a village turned into an island by flood.




A fairytale novella opening up into fascinating worlds and introducing gripping characters – rich with 42 imaginative illustrations.




A second selection of stories from the immortal Jatakas, unforgettable for their moral, wit, and wisdom.

**How to get the books at an easy price.**

If you are a subscriber to Chandamama (in any language) between the ages of 6 and 16, you are eligible to the membership of the Chandamama Young Scholars' Club. If you subscribe to Chandamama (in any language) before May 1996, the offer is open to you. You can fill up the form given here on the right side and mail it to us, while sending a token fee of Rs. 50. either by M.O. or by a bank draft drawn in the name of CHANDAMAMA YOUNG SCHOLARS' CLUB. You can then order all or any number of these books at much less than their original price. You get a handy gift of a School Companion Note Book and a decent badge.

What is more, you can participate in talent contests and different activities which the Club proposes to hold in the future.



# CHANDAMAMA BOOKS

**illustrations and production–are soon to roll out of the mama. Written by: Manoj Das, Illustrated by Sisir Datta**




A selection of legends and parables, some of which are believed to have been narrated by the Buddha, their radiance even now undiminished.




A garland of gems from the great treasure of India's folklore and ancient fiction. Each story has a message, as relevant today as it was ever before.




An invitation into the delightful world of ancient tales, legends and parables. Each story enriches us with prudence and helps us understand life better.

**MEMBERSHIP FORMALITIES WILL BE PROCESSED ONLY BY END OF FEBRUARY 1996.**

MEMBERSHIP CARD






BADGE

NOTE BOOK

Dear Sir,

Please enrol me a member of the Chandamama Young Scholars' Club.

My Chandamama subscription No. is ..............................

I am sending my Membership fee of Rs. ...................... by M.O./Draft.

I look forward to my acceptance - gift.

Full Name : ........................................................ Signature

Name of Parents : ..........................................................................

Mailing Address : ..........................................................................

Permanent Address : ......................................................................

Date of Birth : ..............................................................................

Class : ...................... School .........................................................




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## పరీక్షల భయం

మార్చ్ నెల రాగానే బయట ఎండతో పాటు విద్యార్థుల మనసులు కూడా వేడెక్కుతాయి. చాలామంది పరీక్షలకు హడావుడిగా తయారవుతూ ఉంటారు. నిద్రాహారాలు పట్టించుకోకుండా పడీపడీ చదువుతూ ఉంటారు. ఫైనల్ పరీక్షలు రాసే కొంతమంది విద్యార్థులు మరీ భయపడుతూ ఉంటారు. నిజానికి సక్రమంగా చదివే విద్యార్థులు పరీక్షలంటే భయపడనవసరం లేదు. పరీక్షలకుముందు తయారు కావడానికి ఒకటి రెండు వారాలు సెలవులు ఇస్తారు. పరీక్షలకు సిద్ధం కావడానికి ఈ రెండు వారాలే చాలు!

ఈ రెండు వారాలలో పునశ్చరణ చేసుకోవడానికి ఒక పథకం రూపొందించుకోవాలి. చదివే పాఠాలు కొత్తవేం కావు. సంవత్సరం పొడవునా ఉపాధ్యాయులు బోధించినవే ; విద్యార్థులు చదివినవే. పాఠ్యపుస్తకాలు, నోట్సు సహాయంతో వాటిని ఒకటికి రెండు సార్లు మననం చేసుకోవడమే ఇప్పుడు చేయవలసిన పని.

అయితే, సంవత్సరమంతా చదవకుండా వృధా చేసినవాళ్ళే భయపడాలి. అటువంటి వాళ్ళు కూడా కొంచెం కష్టపడి పథకం ప్రకారం చదివినట్టయితే పరీక్షలలో ఉత్తీర్ణులు కావడం ఏమంత కష్టం కాదు. దేనికైనా పట్టుదల, కృషి కావాలి.

పరీక్షలు రాస్తున్న విద్యార్థులందరూ విజయం సాధించాలని కోరుకుంటూ, శుభాకాంక్షలు తెలియజేస్తున్నాము.

సంపుటి : 98 'మార్చ్ '96 సంచిక: 3
విడిప్రతి : 5.00 సంవత్సర చందా : 60.00

SANKAR

Statement about ownership of CHANDAMAMA (Telugu)
Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956

| | |
|---|---|
| 1. Place of Publication | CHANDAMAMA BUILDINGS' 188, N.S.K. Salai Vadapalani, Madras - 600 026. |
| 2. Periodicity of Publication | MONTHLY Ist of each calender month |
| 3. Printer's Name | B.V. REDDI |
| Nationality | INDIAN |
| Address | Prasad Process Private Limited 188, N.S.K. Salai Vadapalani, Madras - 600 026 |
| 4. Publisher's Name | B. VISWANATHA REDDI |
| Nationality | INDIAN |
| Address | Chandamama Publications 188, N.S.K. Salai Vadapalani, Madras - 600 026 |
| 5. Editor's Name | B. NAGI REDDI |
| Nationality | INDIAN |
| Address | 'Chandamama Buildings' 188, N.S.K. Salai Vadapalani, Madras - 600 026 |
| 6. Name and address of Individuals who own the paper | CHANDAMAMA PUBLICATIONS PARTNERS : 1. Sri B. VENKATRAMA REDDY 2. Sri B.V. NARESH REDDY 3. Sri B.V. SANJAY REDDY 4. Sri B.V. SHARATH REDDY 5. Smt. B. PADMAVATHI 6. Sri B.N. RAJESH REDDY 7. Smt. B. VASUNDHARA 8. Kum. B.L. ARCHANA 9. Kum. B.L. ARADHANA (Minor) (Minor admitted to the benefits of Partnership) 'Chandamama Buildings' 188, N.S.K. Salai Vadapalani, Madras - 600 026 |

I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

1st March 1996

B. VISWANATHA REDDI
Signature of the Publisher

వార్తలు-విశేషాలు:

# పాలస్తీనా అధ్యక్షుడు

అరబ్ ప్రపంచంలో అతిపిన్న దేశమైన పాలస్తీనాకు యాసర్ అరాఫత్ తొలి అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. జనవరి 20వ తేదీ జరిగిన సాధారణ ఎన్నికలలో 88 మంది సభ్యులు గల కౌన్సిల్ కూడా ఎన్నికయింది. అందులో అరాఫత్ నాయకత్వం వహించే ఫతాహ్ పార్టీకి కావలసినంత మెజారిటీ లభించింది.



అరాఫత్ పూర్తి పేరు అబ్దుల్ రెహమాన్ అరాఫత్ అల్‌కుద్వాయ్. 1948వ సం॥లో ఇజ్రాయెల్ దేశం ఏర్పడి మాతృభూమి నుంచి పాలస్తీనియన్లు తరుమగొట్ట బడినప్పుడు అరాఫత్ కైరో విశ్వవిద్యాలయంలో ఇంజనీరింగ్ చదువుకుంటూన్న ఇరవైయేళ్ళ యువకుడు. అయన తన జాతి జనులకు జరుగుతూన్న అన్యాయాన్ని చూసి సహించలేక పోయాడు. అరబ్ నేషనలిజం చేత ప్రభావి తుడయ్యాడు. ఇళ్ళు నిర్మించే ఇంజనీరింగ్ విద్యకు స్వస్తి చెప్పాడు. తన ప్రజలకు మాతృ భూమిని సాధించే మహత్తర కార్యానికి పూనుకున్నాడు. ఆయన పాలస్తీనా విమోచన సంస్థ ( పి.ఎల్.ఓ) ను స్థాపించి కొంత కాలానికి దాని అధ్యక్షుడయ్యాడు.

ఆయన మొదట ఇజ్రాయెల్ దురాక్రమణ దారులపై గెరిల్లా దాడులు మొదలు పెట్టాడు. ఆ చర్య అయన పై అతి దారుణమైన తీవ్రవాది అనే ముద్రవేసింది. ఆ తరవాత ఆయన ఇజ్రాయెల్ సేనలతో ప్రత్యక్షయుద్ధానికి పూనుకుని కొంత విజయం సాధించాడు. ఇది పాలస్తీనియన్ల అభిమానానికి పాత్రమయింది. ఐక్యరాజ్య సమితి పాలస్తీనాను 'అబ్జర్వర్'గా అనుమతించింది. 1974వ సం॥లో అరాఫత్ ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీలో ఉపన్యసించాడు. అప్పుడాయన చేతిలో శాంతికి చిహ్నమైన ఆలివ్ రెమ్మను పట్టుకుని వెళ్ళి, "ఈ ఆలివ్ రెమ్మను నా చేతులనుంచి జారిపో నివ్వకండి!" అని కోరాడు.

ఇజ్రాయెల్-పి.ఎల్.ఓ పరస్పరం గుర్తించుకోక పోవడంతో యుద్ధం కొనసాగుతూ వచ్చింది. ఉభయ పక్షాలూ విజయాలను ప్రకటించాయి. పరాజయాలను అంగీకరించాయి. ఉభయదేశాల మధ్య మంతనాలు జరపడానికి కొన్ని దేశాలు ముందుకు వచ్చాయి. దాని ఫలితంగా అరాఫత్ 1988వ సం॥లో ఐక్య రాజ్యసమితిలో--ఇజ్రాయెల్‌ను దేశంగా గుర్తించడానికి తన అంగీకారాన్ని తెలియబరిచాడు. దాంతో విజ్ఞత గల వ్యక్తిగా ఆయన ప్రపంచదేశాల అదరణకు పాత్రుడయ్యాడు.

1993వ సం॥ 'పాలస్తీనా అథారిటీ' ఏర్పాటు చేయబడింది. పి.ఎల్.ఓ, ఇజ్రాయెల్ నాయకులు సంప్రదింపులకు దిగారు. 1995 సెప్టెంబర్ 29వ తేదీ అరాఫత్, ఇజ్రాయెల్ విదేశాంగ మంత్రి సైమన్ పెరిజ్ ఒక ఒప్పందంలో సంతకాలు చేశారు. పశ్చిమతీరం, గాజా స్ట్రిప్ వంటి కొన్ని ఆక్రమిత ప్రాంతాల నుంచి ఇజ్రాయెల్ వైదొలగడం ప్రారంభించింది. అక్కడ పాలస్తీనియన్ల అధికారం పునరుద్ధరించబడింది. అక్కడ ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించడానికే జనవరిలో ఎన్నికలు జరిగాయి.

పాలస్తీనా చాలా పురాతనమైన ప్రాంతం. పశ్చిమ తీరంలోని జెరికోలో దాదాపు 9000 సంవత్సరాలకు పూర్వం మానవులు ప్రప్రథమంగా నివాసం ఏర్పరచుకున్నారనడానికి చారిత్రక ఆధారాలు ఉన్నాయి.

ఇప్పుడు జరిగిన ఎన్నికలలో అరాఫత్‌కు ప్రత్యర్థిగా పోటీచేసిన డెబ్బైరెండేళ్ళ శ్రీమతి సమీహా ఖలీల్ పదిశాతం ఓట్లు పొందింది. అరాఫత్ 88 శాతం ఓట్లు సాధించాడు.

పి.ఎల్.ఓ – ఇజ్రాయెల్ మధ్య సంధి ఏర్పరచి రెంటినీ దగ్గరికి తీసుకురావడానికి ఈజిప్టు ప్రముఖ పాత్ర వహించింది. స్వతంత్ర పాలస్తీనా ఏర్పడడానికి ఇప్పుడు జరిగిన ఎన్నికలు ఒక ముందడుగు అని ఈజిప్టు నాయకులు భావిస్తున్నారు.



# ఉప్పయ్య ఊరిప్రయాణం

ఉప్పయ్య అనే అతడు ఉప్పలపాడు అనే గ్రామం వచ్చాడు. అతను వెంట ఏమీ తెచ్చుకోలేదు. ఆశ్రయం కోసం గ్రామాధికారిని కలుసుకున్నాడు. ఆయన అతడికి ఖాళీగా ఉన్న భూస్వామి భూషయ్య ఇల్లు ఇప్పించాడు. బ్రతుకు తెరువు కోసం నాలుగిళ్ళల్లో పనిచేసుకోమన్నాడు.

ముందుగా ఉప్పయ్య, భూషయ్య ఇంటికి వెళ్ళి, "అయ్యా! మీ ఇల్లు నాకెంతో సదుపాయంగా ఉంది. అద్దె కట్టకుండా అందులో ఉంటున్నందుకు, నాకు మొహమాటంగా ఉంది. తమరు నిస్సంకోచంగా నా వల్ల ఏ పని ఉన్నా అడుగుతూండండి. చేసి పెడుతూంటాను," అన్నాడు.

భూషయ్య నవ్వి, "నా తమ్ముడికి పెళ్ళయితే, వేరేఉంటాడని ఇల్లు కొన్నాను. తీరా చూస్తే వాడు పట్నం వెళ్ళి స్థిరపడ్డాడు. ఇల్లు ఖాళీగా ఉంది. మనుషులుండకపోతే ఇల్లు పాడుబడి పోతుంది. రోజా పనివాళ్ళను పెట్టి ఆ ఇంటికి బోలెడు చాకిరీ చేయిస్తున్నాను. అందుకయ్యే ఖర్చు తక్కువేమీకాదు. నువ్వుండడం వల్ల నాకు ఆ ఖర్చు తగ్గుతుంది. అదే నా అద్దె అనుకుంటాను. ఏ మొహమాటం లేకుండా నువ్వు ఆ ఇంట్లో ఉండు," అన్నాడు.

"అయినా మీకు నేను అద్దె బాకీ ఉన్నట్టే లెక్క! నా రోజులు బాగున్నప్పుడు, ఆ బాకీ తప్పక తీరుస్తాను," అని, ఉప్పయ్య అక్కణ్ణించి ఒక్కొక్క ఇంటికీ వెళ్ళి పని అడగసాగాడు.

మొదటి ఇంట్లో సీతాకరుడనే కవి ఉంటున్నాడు. ఆయన ఉప్పయ్యతో, "నేను కవిని. కావ్యాలు రాసి భాగ్యవంతులకు అంకితం ఇస్తుంటాను. వాళ్ళు నాకు డబ్బు ఇస్తారు. దాంతో నాకు రోజులు సుఖంగా వెళ్ళిపోతున్నాయి. నా భార్యకు సాయంగా

ఒక ఆడమనిషి నెలజీతం మీద పనులు చేస్తున్నది. మా ఇంట్లో ఇంకేమీ పని లేదు. ఏమీ అనుకోకు," అన్నాడు.

"అయ్యా! మీ ఇల్లు పెద్దదిగా కనబడుతున్నది. పెరడు కూడా ఇంటికి తగ్గట్టే పెద్దదిగా తోస్తున్నది. నాకు అవకాశమిస్తే,పెరటి తోట పని చూస్తాను. కాదనకండి. మీరు పనివ్వకపోతే నాకే ఆధారమూ లేదు," అన్నాడు ఉప్పయ్య.

సీతాకరుడు ఉప్పయ్య వంక ఆశ్చర్యంగా చూశాడు. అతడి ముఖంలో చదువుకున్న కళ ఉంది. చూడ్డానికి కాయకష్టం చేసేవాడిలా లేడు. అవసరం ఎలాంటి పనులైనా చేయిస్తుందని మనసులో అనుకుని, ఉప్పయ్యతో, "నా పెరటితోట పని నేనే చేసుకుంటాను. అదే నా శరీరానికి వ్యాయామం. ఆ మాత్రం వ్యాయామం లేకపోతే ఆరోగ్యం పాడవుతుంది. నువ్వు నీ బ్రతుకుతెరువు గురించి బెంగపడకు. పని దొరికే దాకా మా ఇంట్లో భోజనం చేస్తూండు. భగవంతుడి దయవల్ల తిండికి లోటు లేదు నాకు," అన్నాడు.

ఉప్పయ్య తల వంచి, సీతాకరుడికి నమస్కరించి, "మీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి. ఊరికే ఎవరింటా భోజనం చేయడం నాకు నచ్చదు. నన్ను నమ్మితే తమరు నేనడిగినప్పుడల్లా, మీ శక్తికొద్దీ అప్పు ఇవ్వండి. నా రోజులు బాగున్నప్పుడు బాకీ తీర్చుకుంటాను," అని అక్కడి నుంచి రెండో ఇంటికి వెళ్ళాడు.



ఆ ఇల్లొక వ్యాపారిది. ఆయనింట్లోనూ పని లేదు. ఆయనా సీతాకరుడిలాగే చెప్పాడు. ఉప్పయ్య సీతాకరుడికి చెప్పిన మాటలే ఆయనకూ చెప్పాడు.

అలా ఉప్పయ్య చాలా ఇళ్ళు తిరిగాక ఎక్కడా పని దొరక్క అలిసిపోయి నీరసం వచ్చి ఒక చెట్టుకింద కూలబడ్డాడు. అప్పుడా దారినే వెళుతూ గ్రామాధికారి అతడిని చూసి, ఆగి పలకరించి, "పని దొరికిందా?" అని అడిగాడు.

"అయ్యా! మీ ఊరు చాలా గొప్పది. అందరూ ఎవరి పనులు వారే చూసుకుంటున్నారు. అందువల్ల నాకు పని దొరకలేదు," అంటూ ఉప్పయ్య జరిగింది చెప్పాడు.



"రోజుకొక ఇంట్లో భోజనం చెయ్యి. నీ రోజులు సుఖంగా వెళ్ళిపోతాయి," అన్నాడు గ్రామాధికారి నవ్వుతూ.

"ఏ పనీ చేయకుండా ఊరికే భోజనం చేయడం నాకిష్టముండదు. ఎన్నాళ్ళయినా ఉపవాసాలుండగల శక్తి నాకుంది," అన్నాడు ఉప్పయ్య.

అప్పుడు గ్రామాధికారి ఆశ్చర్యపోయి ఉప్పయ్యను పరీక్షగా చూశాడు. అతడాయనకు సామాన్యుడిలా తోచలేదు. అలాంటి వాడిని తన గ్రామం ఆదరించి తీరాలనుకున్నాడాయన.

వెంటనే గ్రామాధికారి ఊరి పెద్దలను కొందరిని పిలిపించి, ఉప్పయ్య గురించి చెప్పి, "ఇతడు అభిమానమున్న మనిషి. ప్రతిఫలమివ్వకుండా దానం పుచ్చుకోడు. మన ఊళ్ళో అతడు తిండి లేక మల మల మాడి పోకూడదు. కాబట్టి మన మందరం కలిసికట్టుగా అతడికి సాయపడదాం. రోజూ ఒక ఇంట్లో పని ఇచ్చి భోజనం పెడదాం," అన్నాడు.

ఊరి పెద్దలంతా దీనికి అంగీకరించారు. ఆ విధంగా ఉప్పయ్యకు పని దొరికింది. తిండికి లోటు లేకుండా రోజులు గడిచి పోతున్నాయి. అయితే, ఉప్పయ్య అంతటితో తృప్తి పడక, ప్రతిరోజూ ఊళ్ళో ఎవరో ఒకరి వద్ద ఎంతో కొంత అప్పు చేసేవాడు. కొందరి వద్ద ఒక్క వరహా తీసుకుంటే, మరికొందరి వద్ద నూరు వరహాలు తీసుకున్నాడు. తన రోజులు బాగున్నప్పుడు బాకీ తీర్చుతానని అందరికీ మాట ఇచ్చాడే తప్ప, ఎప్పుడు తీర్చేదీ చెప్పలేదు. విచిత్రంగా, ఎవరూ అతన్ని బాకీ తీర్చమని వేధించ లేదు. మాట వరసకు కూడా బాకీ గురించి అతనికి గుర్తు చేయలేదు.

అలా ఏడాది గడిచింది. ఒకరోజున ఉప్పయ్య గ్రామాధికారిని కలుసుకుని, "నేను ఊరికి వెళుతున్నాను. ఊళ్ళో వాళ్ళ నందర్నీ సమావేశపరచండి. ఎవరెవరికి ఏం కావాలో అవి తెచ్చిపెడతాను," అన్నాడు.

గ్రామాధికారి నవ్వి, "నువ్వేం తేగలవు?" అని అడిగాడు.

"నేను వెళ్ళే ఊరిలో లలితాంబిక అనే అమ్మవారుంది. ఆమె ఎలాంటి కోరికలయినా తీర్చగలదు," అన్నాడు ఉప్పయ్య.

"ఆ ఊరెక్కడున్నదీ చెప్పు. నేనూ నీతో వస్తాను. స్వయంగా అమ్మవారిని అడగవలసిన కోరిక ఒకటుంది నాకు," అన్నాడు గ్రామాధికారి.

"ఆ ఊరికింకెవ్వరూ రాలేరు. ఆ మాతను ఇంకెవ్వరూ దర్శించలేరు. మీ కోరిక ఏమిటో చెప్పండి. నేను మీ తరఫున అమ్మవారికి విన్నవిస్తాను," అన్నాడు ఉప్పయ్య.

"నా వివాహం జరిగి పదిహేనేళ్ళయింది. నా భార్య సంతానవతి కాలేదు. అమ్మవారు మాకు బిడ్డను ప్రసాదించగలదా?" అన్నాడు గ్రామాధికారి ఆతృతగా.

"అవశ్యం!" అన్నాడు ఉప్పయ్య.

వెంటనే గ్రామాధికారి ఉప్పయ్య ఊరి ప్రయాణం గురించి చాటింపు వేయించాడు. సాయంత్రానికల్లా ఊళ్ళో వాళ్ళందరూ ఒకచోట సమావేశమయ్యారు. ఉప్పయ్య వాళ్ళందర్నీ ఉద్దేశించి, "భగవంతుడున్నాడా, లేడా అని మనుషులందరికీ అనుమానం వస్తుంది. ఆయన ఉన్నాడు. మంచిని ప్రోత్సహిస్తాడు. చెడును శిక్షిస్తాడు. ఈ ఊళ్ళో ఉన్న వాళ్ళందరూ మంచివాళ్ళు. మీకాయన మేలు చేస్తాడు. మీ మీ కోరికలు నాకు చెప్పండి. నేను లలితాంబికా అమ్మవారికి నివేదిస్తాను," అన్నాడు.



ఊరివాళ్ళందరూ ఒకరి తరవాత ఒకరు లేచి, ఉప్పయ్యకు తమ కోరికలు చెప్పుకున్నారు. ఒకడి తల్లి దీర్ఘవ్యాధితో మంచం పట్టింది. అది నయం కావాలని కోరుకున్నాడు. ఒకామె భర్త పరమ కోపిష్టి. అతడు శాంతమూర్తి కావాలని కోరుకున్నది.

కొందరు తమకు సంబంధించిన కోర్కెలు కోరుకుంటే, కొందరు ఊరుకు సంబంధించినవి కోరుకున్నారు.

ఆ ఊళ్ళో మంచినీటి బావులు లేవు. ఉన్న బావులన్నింటిలోనూ ఉప్పునీరే! మంచి నీటి కోసం ఊరి బయట సెలయేటికి వెళ్ళవలసి ఉంది. ఊళ్ళో మంచినీటి బావులు కావాలని కొందరు కోరారు. ఊళ్ళో బాటల



వాడి పేరు నీలయ్య. చంద్రపురం వాడి గ్రామం. ఉప్పయ్య ఆ గ్రామంలో ఏడాది పాటుండి అందరి దగ్గరా అప్పులు చేసి, ఒక రోజున ఊరికి ప్రయాణమవుతూ, లలితాంబికా అమ్మవారి ద్వారా అందరి కోరికలూ తీర్చుతానన్నాడు. గ్రామస్థులకు అతడి మీద అనుమానం పుట్టి, ముందు తమ బాకీలు తీర్చమన్నారు. అంతే! రాత్రికి రాత్రి ఉప్పయ్య గ్రామం నుంచి మాయమయ్యాడు. గ్రామస్థులు అతన్ని వెతికి పట్టుకోమని నీలయ్యను నియోగించారు.

"నీలయ్య చెబుతున్నది నిజమేనా?" అని అడిగాడు ఉప్పయ్యను, గ్రామాధికారి. ఉప్పయ్య నిజమేనని తలాడించాడు.

ప్రక్కన మొక్కలు బ్రతకడం లేదు. మధ్యాహ్నపు ఎండకు నీడనిచ్చే చెట్లు బ్రతకాలని కోరారు. ఆ ఊరి రామాలయం శిథిలమయింది. దాన్ని దేవశిల్పులు తప్ప మరమ్మతులు చేయరాదుట! ఆలయం కూలిపోతే ఊరికి అరిష్టమట. ఆలయం ఎప్పటిలా కావాలని కొందరు కోరారు.

ఇలా అందరూ రకరకాల కోర్కెలు ఉప్పయ్యకు చెప్పుకుంటూంటే, అక్కడికొక మనిషి వచ్చాడు. వాడు నల్లగా, ఎత్తుగా, బలిష్టంగా ఉన్నాడు. ఉప్పయ్యను చూస్తూనే వాడు "నువ్విక్కడున్నావా?" అన్నాడు.

గ్రామాధికారి వాణ్ణి దగ్గరకు పిలిచి వివరాలడిగాడు.

"అలా ఎందుకు చేశావు?" అని ప్రశ్నించాడు గ్రామాధికారి.

దానికి ఉప్పయ్య, "నేను లలితాంబిక భక్తుణ్ణి. ఆమె ద్వారా మంచి మనుషుల కోర్కెలు తీర్చాలని నిర్ణయించుకుని, బంగినపల్లి అనే గ్రామం వెళ్ళి, ఇక్కడున్నట్టే ఏడాది ఉన్నాను. వాళ్ళనుంచి అప్పుల రూపంలో మూడు వేల వరహాలు తీసుకున్నాను. గ్రామస్థుల కోరికలు తీర్చడానికి గ్రామాన్ని విడిచి పెట్టాలనుకున్నాను. వాళ్ళు బాకీలు తీర్చనిదే గ్రామం నుంచి కదలనివ్వమన్నారు. పోగుచేసిన డబ్బంతా ఇంట్లో ఒకచోట దాచాను. తీరా చూస్తే దాన్నెవరో దొంగిలించారు. ఆ విషయం చెబితే గ్రామస్థులు

నమ్మలేదు. అందువల్ల ఎవరికీ తెలియకుండా అక్కణ్ణించి పారిపోయి చంద్రపురం వెళ్ళాను. ఆ ఊళ్ళో ఏడాది ఉండి ఆరువేల వరహాలు పోగుచేశాను. అక్కడా బంగినవల్లిలోలాగే ఊరివాళ్ళు నన్నూరు దాటి పోనివ్వలేదు. ఎవరికీ తెలియకుండా ఊరు వదిలిపెట్టి బంగినపల్లి వెళ్ళి, నా బాకీలు రెట్టింపు వడ్డీ ఇచ్చి మరీ తీర్చాను. ఆ తర్వాత ఈ ఊరొచ్చాను. ఇప్పటికి పన్నెండువేల వరహాలు పోగు చేశాను. ఈ డబ్బు తీసుకుని వెళ్ళి చంద్రపురం వాళ్ళ బాకీలు తీర్చదలిచాను. అక్కణ్ణించి నా ఊరెళ్ళి లలితాంబికా అమ్మ వారికి చెప్పి, మీ కోర్కెలు తీర్చాలనుకున్నాను. ఇంతలో నీలయ్య వచ్చాడు. ఇదీ నా కథ?" అన్నాడు.



నీలయ్య వెటకారంగా నవ్వి, "అన్నీ దొంగ మాటలు. పన్నెండువేల వరహాలతో ఇక్కణ్ణించి పారిపోవాలనుకున్నావు. నేను రావడంతో నీ మోసం బయటపడింది," అన్నాడు.

"తప్పు నీలయ్యా! నిజానిజాలను నువ్వు కాదు, దైవం నిర్ణయించాలి. నేను మీ గ్రామ స్థుల కోసం పోగు చేసిన డబ్బును స్వయంగా వచ్చి అందిస్తాను. అందరికీ అసలుకురెట్టింపు ఇస్తాను. సరేనా?" అన్నాడు ఉప్పయ్య.

"ఆ తర్వాత ఇంకో గ్రామానికి వెళ్ళి, ఇరవైనాలుగు వేల వరహాలు పోగుచేసి, ఈ గ్రామస్థులకిస్తావా? ఇలా ఎంతకాలం కాకుల్ని కొట్టి గద్దలకు వేస్తావు? నిన్ను కారాగారంలో వేయించేదాకా నాకు మనశ్శాంతి ఉండదు," అన్నాడు నీలయ్య కోపంగా.

అప్పుడు గ్రామాధికారి కలుగజేసుకుని, "నీలయ్యా! నా గ్రామం పాడిపంటలతో సుభిక్షంగా ఉంది. మేము మంచితనాన్ని నమ్ముకున్నవాళ్ళం. ఈ ఉప్పయ్య మంచి వాడని నమ్ముతున్నాం. ఇతడికిచ్చిన డబ్బు గురించి మాకు చింత లేదు. బాకీ తీర్చాలనీ, ప్రతిఫలం ఇవ్వాలనీ ఇతడే తాపత్రయ పడుతున్నాడు. ఇతడు మాకు బాకీ ఉన్నాడను కుంటున్నాడేమో కానీ, మా అభిప్రాయంలో ఇతడు మాకు బాకీ లేడు. మీ గ్రామస్థుల బాకీ తీరగానే ఇతడిని విడిచిపెట్టు. అలా చేస్తే ఇతడు లలితాంబికా అమ్మవారిని

దర్శించి, మా గ్రామానికి ఉపకారం చేయగలుగుతాడు," అన్నాడు.

నీలయ్య కాదన్నట్టు తలాడించి, "ఇతడిని విడిచిపెడితే, మరొక గ్రామానికి వెళ్ళి, ఇలాగే పీడించడని నమ్మకమేమిటి? లలితాంబికా అమ్మవారి ద్వారా ఊరికి ఉపకారం చేయగలవాడు, తన బాకీలను తీర్చడానికి ఊరూరా తిరిగి ప్రజల సొమ్మునెందుకు దోచాలి?" అన్నాడు.

గ్రామాధికారి నవ్వి, "బంగినపల్లిని వదిలినప్పుడు, ఇతడిని ఆ గ్రామస్థులు బాకీ తీర్చమని బలవంత పెట్టారు. అందుకని ఇతడు మీ చంద్రపురం వచ్చాడు. అక్కడా మీరు బాకీలు తీర్చమని బలవంత పెట్టారు. అందుకని ఇతడు మా గ్రామం వచ్చాడు. మాకితడు తీర్చవలసిన బాకీలు లేవని అంటున్నాం. కాబట్టి, ఇతడిక లలితాంబికా అమ్మవారి ఊరికి మాత్రమే వెళతాడు. తను చేసిన బాకీలకు తానివ్వగల ప్రతిఫలాన్ని తనే స్వయంగా సంపాదించే ఉప్పయ్య, తన వల్ల కాని పనులకు మాత్రమే లలితాంబికా అమ్మవారి వద్దకు వెళతాడు. ఇదీ మా నమ్మకం! మా నమ్మకం నిజం కాకపోయినా మేము ఏ మాత్రం బాధపడం," అన్నాడు నీలయ్యతో.

ఉప్పయ్య గ్రామాధికారికి కృతజ్ఞతలు తెలుపుకుని, నీలయ్యతో బయలుదేరి వెళ్ళి, చంద్రపురం చేరుకుని, అక్కడ అందరి బాకీలూ అసలుకు రెట్టింపు చొప్పున తీర్చాడు.

ఆ తర్వాత కొంత కాలానికి, ఉప్పలపాడు గ్రామాధికారికి పండంటి మగబిడ్డ కలిగాడు. అందరి ఇళ్ళలోనూ వారు వారు కోరిన శుభాలు జరిగాయి. ఊరి బావుల్లో ఉప్పునీరు మంచి నీరయింది. ఉప్పలపాడు గ్రామస్థులందరూ, ఉప్పయ్య గురించి గొప్పగా చెప్పుకుంటూ రాజ్యమంతటా ప్రచారంచేశారు. ఆ తర్వాత ఎందరో గ్రామస్థులు ఉప్పయ్యకు స్వాగతం పలకాలని చూశారు కాని, అతడి ఉనికి తెలియలేదు. స్వార్థం కొద్దీ మంచి అవకాశాన్ని పోగొట్టుకున్నామని బంగినపల్లి, చంద్రపురం గ్రామస్థులు ఇప్పటికీ విచారపడుతూంటారు.






## 9

[సూర్యభగవానుడి పశువులను చంపి తిన్న పాపాన రూపధరుడి అనుచరులందరూ, నౌకతో సహా సముద్రం పాలయ్యారు. రూపధరుడు ఒంటరిగా ఒక తీరానికి వచ్చి పడి ఆ దేశాన్ని ఏలే మహామేధి మహారాజు కుమార్తె అయిన వారుణి సహాయంతో రాజభవనం చేరుకుని ఆశ్రయం సంపాదించుకున్నాడు. మహామేధి రూపధరుడికి అన్ని విధాలా తోడ్పడతానని మాట ఇచ్చాడు. ఆ రాత్రి రూపధరుడు సుఖంగా నిద్రపోయాడు ---తరవాత]

మర్నాడు తెల్లవారింది. మహామేధితోబాటే రూపధరుడు కూడా నిద్ర లేచాడు. ఇద్దరూ కలిసి సభాభవనానికి వెళ్ళారు. ఈ సభా భవనం ఓడల రేవుకు సమీపంలోనే ఉన్నది. అందులో నున్నని రాతితో చేసిన ఆసనాలు న్నాయి. మహామేధి ఒక ఆసనంపై కూర్చుని రూపధరుడిని తన పక్కనే కూర్చోబెట్టాడు. ఈలోగా రాజుగారి భటుడొకడు రూపధరుడి ప్రయాణపు ఏర్పాట్లు చూడడానికి నగరంలోకి వెళ్ళాడు. అతను పెద్దలనందరినీ పేరుపేరునా సభాభవనానికి ఆహ్వానించి, ఎవరో అపూర్వ పురుషుడు రాజుగారికి అతిథిగా వచ్చినట్టు తెలియజేశాడు.

ఈ కొత్త వ్యక్తిని చూడడానికి పెద్దలందరూ వెంటనే బయలుదేరి వచ్చారు. త్వరలోనే సభాభవనంలోని ఆసనాలన్నీ భర్తీ అయ్యాయి. అక్కడ సమావేశమయిన వారితో రాజు ఇలా అన్నాడు:



"మహాజనులారా, నా పక్కన ఆసీనుడైఉన్న వ్యక్తి నా ఇంటికి అతిథిగా వచ్చాడు.ఆయన ఎవరో నాకు తెలియదు. ఆయన సముద్రం మీద వచ్చాడు. ఆయన తూర్పునుంచి వచ్చాడో, పడమటి నుంచి వచ్చాడో కూడా నాకు తెలియదు. అయితే, ఆయన తన ప్రయాణానికి సహాయం చెయ్యమని నన్ను కోరాడు. దానికెన్నడూ అభ్యంతరం లేదు. ఎందుకంటే– నా ఇంటికి అతిథిగా వచ్చి అసంతృప్తితో వెళ్ళిపోయిన వారెవరూ లేరు. కనుక మనం మన ఆచారం తప్పకుండా ఈ వ్యక్తికి సహాయం చెయ్యవలసి ఉన్నది. మనం ఒక కొత్త నౌకను ఈయన పరం చేసి తెడ్లు వేసేవారిని యాభైఇద్దరిని తోడు ఇద్దాం. తెడ్లు వేయడంలో సమర్థులయిన వారు బయలుదేరి వెళ్ళి నౌకలో తెడ్లు అమర్చి భోజనానికి నా ఇంటికి వచ్చేయండి. మిగిలిన పెద్దలు కూడా మా ఇంటికే విందుకు రావాలి. విందు ఏర్పాట్లు పెద్ద ఎత్తున చేయిస్తాను. విందు సమయంలో వినోదంగా పాడడానికి గాను వెంటనే తగిన మనిషిని చూసి పిలిపించండి."

మహామేధి మహారాజు సభికులతో ఈ మాటలు చెప్పి, రూపధరుణ్ణి వెంట తీసుకుని తన భవనానికి బయలుదేరి వెళ్ళాడు.వెంటనే పాడేవారికి కబురు వెళ్ళింది. యాభైఇద్దరు సమర్థులైన నావికులు కొత్త పడవను జల ప్రవేశం చేయించి, తెడ్లు అమర్చారు. దానికి వారు ఒక తెల్లని తెరచాప ఎత్తి, నౌకను లోతు నీటిలో లంగరు వేసి రాజభవనానికి వెళ్ళారు.

రాజభవనంలోని గదులూ, చావడులూ, ప్రాంగణాలూ అతిథులతో నిండిపోయాయి. విందుకు గాను గొర్రెలనూ, అడవిపందులనూ, ఎద్దులనూ కోశారు. విందుసమయంలో పాడడానికి ఒక అంధగాయకుడు పిలిపించబడ్డాడు.

అందరూ ఎంతో సంతోషంగా భోజనాలు చేసే సమయంలో ఆయన పాడిన పాట రూపధరుడి జీవితంలో జరిగిన ముఖ్యమైన సంఘటనకు సంబంధించినదే. ఆ సంఘటన ఏమంటే–

ట్రోయ్ యుద్ధంఇంకా ఆరంభం కాలేదు. రారాజు భవిష్యత్తు తెలుసుకునే నిమిత్తమై మైధో వద్ద నున్న సూర్యాలయానికి వెళ్ళాడు. "ట్రోయ్ పతనమయ్యే లోపుగా నీ యోధుల మధ్య కలహం వస్తుంది," అని సూర్యభగ వానుడు రారాజుకు తెలియ బరిచాడు. అలాగే జరిగింది కూడా. ఒకనాడు భోజనాల దగ్గిర రూపధరుడూ, వజ్రకాయుడూ తగాదా పడి ఒకరినొకరు గట్టిగా తిట్టుకున్నారు. రారాజు ఈ తగాదా చూసి విచారించడానికి బదులు సంతోషించాడు. ఎందుచేతనంటే ఇది తనకు శుభసూచకమని సూర్యభగవానుడు అదివరకే ఆయనకు చెప్పి ఉన్నాడు.



అంధగాయకుడు ఈ విందులో పై సంఘట నను పాట కట్టి పాడాడు. కానీ ఈ పాటవిం టూంటే రూపధరుడికి దుఃఖావేశం ముంచుకు వచ్చింది. తన కంటినీరు ఇతరులు చూసి పోతారని అతడు తన ముఖాన్ని బట్టకొంగుతో కప్పేసుకున్నాడు. మధ్య మధ్య గాయకుడు పాట నిలిపినప్పుడు రూపధరుడు తనకళ్ళు తుడుచుకుని ముఖానికి అడ్డం తొలగించే వాడు. మళ్ళీ గాయకుడు పాటఆరంభించగానే అతనికి కంటి వెంట అశ్రుధారలు కారేవి, అతను ముఖాన్ని తిరిగీ బట్టతో కప్పేసుకునే వాడు.

రూపధరుడి చర్యలను ఇతరులెవరూ గమనించలేదు గాని, అతని పక్కనే కూచుని భోజనం చేస్తున్న మహామేధి గమనించాడు. రూపధరుడు బాధతో మూలగటం కూడా అతనికి వినిపించింది.

చిట్టచివరకు మహామేధి తన అతిథులతో, "మిత్రులారా, మనం కడుపు నిండా భోజనం చేశాం. ఇక ఈ పాట చాలించి, మనం వ్యాయా మక్రీడలు తిలకించుతాం. అవి మన అతిథి కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడినవి. మల్లయుద్ధంలోనూ, దూకటంలోనూ మన ప్రజ్ఞ ఎంత అసాధారణమైనదో మన అతిథి చూసినట్టయితే, ఆయన తన దేశవాసులకు చెప్పగలుగు తాడు!" అన్నాడు.

రాజుగారు లేవగానే మిగిలిన అందరూ లేచి ఉత్సాహంగా మైదానానికి బయలు దేరారు.



దృఢంగా ఉన్నాయి. వయసు కూడా ముదిరిన వాడేమీ కాదు!" అన్నాడు ఉత్సాహంగా.

రాజకుమారుడితో అతని అనుచరులు, "భేష్! నువ్వే వెళ్ళి ఆయనను ప్రశ్నించి, పోటీకి పిలువు!" అన్నారు. అతడు రూపధరుణ్ణి సమీపించి, "అయ్యా, మీకు వ్యాయామ క్రీడలతో పరిచయం ఉన్నట్లయితే ఆటలలోకి రండి. ప్రతి మనిషికీ వ్యాయామ క్రీడలు తెలిసి ఉండాలి. మీరు నిరుత్సాహంగా వుండ వలసిన పని లేదు. మిమ్మల్ని మీ దేశానికి చేర్చడానికి మీ కోసం నౌకా, నావికులూ కూడా సిద్ధంగా ఉన్నారు," అని చెప్పాడు.

"అలా ఎందుకంటావు, నాయనా? మీరంతా నన్ను వేళాకోళం పట్టిస్తున్నారు లాగుంది. ఇప్పుడు కష్టాలకు తప్ప ఆటలకు చోటు లేదు. మీ అతిథిగా నేనీ ఆటల పోటీలు చూస్తున్నానే గాని, చూసి ఆనందించడానికి కాదు. ప్రస్తుతం నాకు కావలసిందల్లా మా ఇల్లు చేరడమే!" అన్నాడు రూపధరుడు.

అక్కడ అనేక వేల మంది గుమిగూడారు. వ్యాయామ క్రీడలలో ఆరితేరిన యువకు లంతా పోటీలలో పాల్గొనడానికి సిద్ధంగా ఉన్నారు.

మొదట పరుగుపందెం జరిగింది. తరవాత మల్లయుద్ధమూ, దూకటమూ, బరువు విసరటమూ మొదలైనవి జరిగాయి. అన్ని పందాలలోనూ తలా ఒకరు గెలిచారు. మల్లయుద్ధంలో రాజు కొడుకు గెలిచాడు. అతను తన అనుచరులతో, "ఒరే, మన అతిథి చిన్నతనంలో ఏయే వ్యాయామక్రీడలు అభ్యసించాడో తెలుసుకుందామా? మనిషి చూడడానికి దృఢంగానే ఉన్నాడు. తొడలూ, పిక్కలూ, మెడా బలిష్ఠంగా ఉన్నాయి. చేతులు

అతన్ని రెచ్చగొట్టే ఉద్దేశంతో ఇంకొక యువకుడు రూపధరుడితో, "కాకపోయినా మీ అవతారం చూస్తే వ్యాయామ క్రీడలు తెలిసినట్టు లేదు లెండి! ఏ వర్తక నౌకనో నడుపుకుంటూ, బేళ్ళు లెక్కించడమూ, జమా ఖర్చులు చూసుకోవడమూ మాత్రమే చాతనయిన మనిషిలాగా కనబడతారు!" అన్నాడు.



రూపధరుడికి నిజంగానే కోపం వచ్చింది. అతను కనుబొమలు ముడివేసి, "అబ్బాయీ, కొందరిని భగవంతుడు వికారంగా సృష్టిస్తాడు. కాని వారు నోరు తెరిస్తే ముత్యాలు రాలు తాయి. వారి మాటలు వినడానికి ప్రజలు ఎగబడతారు. మరికొందరు చూడడానికి అందంగానే వుంటారు గాని, వారు నోరు విప్పితే అందరూ చెవులు మూసుకోవల సిందే. భగవంతుడు నీకు అందం ఇచ్చాడు గాని, మెదడు ఇవ్వలేదు. నేను చాలాకష్టాలు పడి శుష్కించి ఉన్నాను. అయినా నాకేపాటి శక్తి ఉన్నదో చూపిస్తాను," అంటూ చివాలున తను ఉన్న అసనం మీది నుంచి లేచి ఒక పెద్ద రాతిగుండు తీసుకొని తన తలపైన ఒక చుట్టు తిప్పి, బలం కొద్దీ దూరంగా విసి రాడు.

దూరం కొలిచే కుర్రవాడు ఆ గుండు పడిన చోటికి పరుగుతో వెళ్ళి, దూరంకొలిచి, "అయ్యా, మిగిలిన వాళ్ళు విసిరిన గుండ్ల న్నింటి కన్నా మీరు ఎక్కువ దూరం విసిరారు. ఇంత దూరం మరెవ్వరూ విసర లేరు, మీరు నిశ్చింతగా వుండవచ్చు!" అని గట్టిగా కేక పెట్టాడు.

రూపధరుడికి ఈ మాటలు విని ఆనందం కలిగింది. అతడు ఉత్సాహంతో, "అబ్బా యిలూ, చాతనయితే, మీరు నాతో పోటీపడి గుండు విసరండి! నేను ఇందులోకిదిగనే దిగాను. కనుక వెనక్కి తగ్గేది లేదు. మల్ల యుద్ధమైనా సరే, పరిగెత్తడమైనా సరే ఎవరు వస్తారో రండి! నాకు విలువిద్య కూడా చాత నవును. యుద్ధరంగంలో ఆ విద్యలో నాకన్న సమర్థుడు ధనధవుడు ఒక్కడే ఉండేవాడు. దేవతల మాట చెప్పను గాని, మానవమాత్రులలో ఎవరితో నయినా ఏ విద్యలోనైనా పోటీకి సిద్ధమే!" అన్నాడు.

ఎవరూ మాట్లాడ లేదు.

మహామేధి రూపధరుడి కేసి తిరిగి, "అయ్యా, మనలను ఇంకొకరు చులకన చేసి మాట్లాడినప్పుడు మన గొప్ప మనం చెప్పుకుంటే అందులో తప్పేం లేదు. మీ శక్తి సామర్థ్యాలను శంకించే అర్హత ఇక్కడ ఎవ్వరికీ లేదు. మాకు కావలిసినదల్లా మీరు

ఇక్కడ కొంత ఆనందం పొంది వెళ్ళడమే. కొన్ని విద్యలలో మేము ఘటికులం. మల్లయుద్ధంలోనూ, ఇతర వ్యాయామ క్రీడల లోనూ మాకు ప్రత్యేకమయిన నేర్పు లేదు. మాకు నేర్పున్నది నౌకలు నిర్మించటంలో, నౌకలు నడపటంలో, పాటలు పాడటంలో, నృత్యం చెయ్యటంలో. వీటిని మీరు తిలకించాలని మా కోరిక. స్వగృహం చేరి, మీ భార్యాబిడ్డల మధ్య సుఖంగా కూచునిఉన్న సమయంలో ఈ అనుభవాలను హాయిగా జ్ఞాపకం చేసుకోవడమే మాకు కావలసినది!" అన్నాడు.

తరవాత నృత్యగానాలు ఏర్పాటు చేశారు. ఆ దేశం వారు చేసిన బృందనృత్యాలు చూసి రూపధరుడు అద్భుతం చెందాడు. అతను మహామేధితో, "మహారాజా, ఇంత అద్భుతమైన నృత్యాలు నేనెక్కడా చూడలేదు," అన్నాడు ఉత్సాహంగా.

తన అతిథి ఆ మాట అనేసరికి రాజు పరమానందం చెందాడు. ఆయన తన దేశంలోని పన్నెండు మంది రాజకుమారులను పిలిచి, వారిచేత తన అతిథికి మంచిబట్టలు పెట్టించి, బంగారం బహుమానంగా ఇచ్చాడు. రూపధరుణ్ణి కవ్వించిన యువకుడు, దంతపు ఒరా, వెండిపిడీ గల తన కత్తిని రూపధరుడికి బహూకరించాడు.

ఆ రాత్రి భోజనాల దగ్గిర అంధగాయకుడు 'కొయ్యగుర్రం' కథ గానం చేశాడు. గ్రీకులు తమ శిబిరాన్ని తగులబెట్టి తమ నౌకలలో వెళ్ళిపోవడంతో కథ ఆరంభమయింది. తరవాత ట్రోజనులు కొయ్యగుర్రాన్ని నగరంలోకి తీసుకుపోవటం మొదలైన వివరాలు వింటూ రూపధరుడు విచారంతో కుంగిపోయి ఏడవసాగాడు.

అది గమనించి మహామేధి పాట నిలుపు చేయించి, రూపధరుడికేసి తిరిగి, "అయ్యా! దాచకుండా నిజం చెప్పండి. మీరెవరు? మీ పేరేమిటి? ఊరేమిటి? మీది ఏ దేశం? మీరు ఎక్కడి నుంచి వస్తున్నారు? ట్రోయ్ యుద్ధం కథ మీకెందుకు విచారం కలిగిస్తున్నది? ఆ యుద్ధంలో మీ ఆప్తులెవరైనా మరణించలేదు గద!" అన్నాడు. —(ఇంకాఉంది)



# మరింత శిక్ష

హేలాపురిలో నేరస్థుల కోసం ఊరి చివర ఒక కారాగారం ఉన్నది. నేరస్థులకు కఠిన శిక్షలతో పాటు, తీరిక సమయాల్లో వారి వినోదానికీ, విజ్ఞానానికీ ఉపకరించగలదన్న నమ్మకంతో, రాజు అరవిందసేనుడు, అక్కడ ఒక గ్రంథాలయాన్ని కూడా ఏర్పాటు చేశాడు. నేరస్థులు ఆ గ్రంథాలు చదువుతూ, తాము అనుభవిస్తున్న శిక్షను తాత్కాలికంగా మరిచిపోయేవారు.

హేలాపురిలో వాసుదేవయ్య అనే ఒక సంపన్నుడున్నాడు. అయనకున్నట్టుండి, తను కవితా గ్రంథాలు రాసి గొప్ప కవిగా పేరు తెచ్చుకోవాలన్న ఆలోచన వచ్చింది. వెంటనే తన పేరును వాసుదేవకవిగా మార్చుకుని గ్రంథాలు రాయడం మొదలుపెట్టాడు. అయితే, అవి ప్రజలను ఆకర్షించకపోగా- అందరూ వాటిని శిరోవేదన గ్రంథాలనసాగారు. ఆ కారణంగా గ్రంథాలన్నీ వాసుదేవయ్య వద్ద నిరుపయోగంగా వుండిపోయినై.

ఈ స్థితిలో ఆ గ్రంథాలను ఏమి చేయడమా అని వాసుదేవయ్య బాగా ఆలోచించి, పనివాడి చేత వాటిని మూట కట్టించి, కారాగృహాధిపతి దగ్గరకు తీసుకుని పోయి, నేరస్థుల కోసం ఏర్పాటు చేసిన గ్రంథాలయంలో వాటిని కూడా వుంచమన్నాడు.

కారాగృహాధిపతి వాసుదేవయ్య నెరుగు. అయన ఎంతో మర్యాదగా, "వాసుదేవ కవిగారూ, క్షమించాలి! రాజాజ్ఞ లేనిదే, నేరస్థులను మరింతగా శిక్షకు గురి చేసే అధికారం నాకు లేదు. అందువల్ల తమ గ్రంథాలను స్వీకరించలేను," అన్నాడు.

ఆ మాటలతో వాసుదేవయ్యకు, తన కవిత్వం విలువ ఏ పాటిదో పూర్తిగా అర్థమై పోయి, ఇంటికి తిరిగి వెళ్ళి- ఇకనుంచి తన పేరు వాసుదేవకవి కాదనీ, వాసుదేవయ్య మాత్రమే అనీ, నగరమంతా చాటింపు వేయించాడు.

— కోనే నాగవెంకటఆంజనేయులు






# విరూపుడిసాహసం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ భీతిగొలిపే ఈ శ్మశానంలో, నీ కఠోర శ్రమ చూస్తూంటే, నువ్వేమైనా విధివంచితుడివా అన్న అనుమానం కలుగుతున్నది. ఎందుకంటే అలాంటి వ్యక్తులు ఎంతటి సాహసవంతులైనా చివరకు ప్రయోజనం శూన్యం. తమ శ్రమకూ, సాహసానికీ తగిన ఫలితం అందే శుభసమయంలో వాళ్ళు అనూహ్యమైన నిర్ణయాలు తీసుకుని, శ్రమ ఫలితాన్ని జారవిడుచుకుంటారు. ఇందుకు నిదర్శనంగా నీకు అపూర్వమైన అదృష్టాన్ని చేజేతులా జారవిడుచుకున్న విరూపుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



పూర్వం పూర్ణచంద్రపురాన్ని ధీరసేనుడనే రాజు పాలించే వాడు. ఆయనకు కాంచన వల్లి ఒక్కతే కుమార్తె. ఆమె అపురూప సౌందర్యవతి. ఆమెను వివాహమాడిన రాజ కుమారుడు, పూర్ణచంద్రపురానికి భావి వారసుడవుతాడు. అందువల్ల ఆమెను వివాహ మాడాలని ఎందరో రాజకుమారులు ఉవ్విళ్ళూర సాగారు.

కాంచనవల్లి సహజంగా అతి ధీరురాలు. తనకు కాబోయే భర్త అత్యంత సాహసి అయి ఉండాలని ఆమె కోరిక. అందుకు గాను పోటీని నిర్వహించమనీ, అందులో గెలిచినవాణ్ణి భర్తగా వరిస్తాననీ ఆమె తండ్రికి చెప్పింది.

ఆమె చెప్పిన పోటీ వివరాలు విని, ధీర సేనుడు దిగ్భ్రమ చెందాడు. ఆయన, కుమా ర్తెతో, "అమ్మా! ప్రాణాలతో చెలగాట మాడే ఇలాంటి పోటీలో, ప్రాణం మీద తీపి ఉన్న వాడెవడూ పాల్గొనడానికి ముందుకు రాడు. మరేదైనా పోటీ ఆలోచించి చెప్పు!" అన్నాడు.

కాంచనవల్లి మందహాసం చేసి, "నన్ను ప్రాణప్రదంగా ప్రేమించేవాడికి, తన ప్రాణాలు పూచికపుల్లతో సమం కాదా, నాన్నా? అలాంటి వీరుడికి ఈ పరీక్ష ఒక లెక్కలోనిది కాదు," అన్నది.

తన కుమార్తె మంకుపట్టెరిగిన ధీరసేనుడు చేసేది లేక సరేనన్నాడు. అయితే, పోటీ వివ రాలు ముందుగా ప్రకటిస్తే, పోటీలో పాల్గొ నేందుకు ఎవరూ సాహసించక పోవచ్చని, ఆయనకు సందేహం కలిగింది. ఆకారణంగా, ఆయన పోటీ వివరాలను వెల్లడించకుండా, రానున్న పంచమినాడు జరిగే అత్యంత సాహసికమైన పోటీలో నెగ్గిన వీరుణ్ణి, రాకు మారి కాంచనవల్లి తన భర్తగా వరిస్తుందని రాజ్యమంతటా చాటింపు వేయించాడు.

పూర్ణచంద్రపురానికి దాపున ఉన్న శ్రీరంగ పురం అనే గ్రామంలో, పుట్టుకతో రెండు చేతులూ లేని విరూపుడనే యువకుడుం డేవాడు. వాడికి చిన్నతనంలోనే తల్లి చనిపో యింది. తండ్రి రెండోపెళ్ళి చేసుకున్నాడు. సవతి తల్లికి సంతానం కలిగాక విరూపుణ్ణి ఆమె రాచి రంపాన పెట్టేది. "ఏ పని

చేయడానికి పనికిరాని నీవంటివాడు బ్రత కడం వ్యర్థం. ఈ భూదేవికి భారం!" అని నిందిస్తూండేది.

కొడుకు దుస్థితికి విరూపుడి తండ్రి కుమిలి పోయేవాడు. కానీ, భార్య నోటిదురుసుతనానికి భయపడి ఆమెను పల్లెత్తుమాట అనలేక పోయేవాడు.

ఇలాంటి పరిస్థితిలో కాంచనవల్లి స్వయం వర వార్త విరూపుడి చెవిన పడింది. రాకుమార్తె స్వయంవరం చూడాలని వాడికి కుతూహలం కలిగింది. పైగా సాహసపోటీ అని చాటింపు వేశారు గనక, అది ఎలా ఉంటుందో చూసి ఆనందించాలని, వాడు పంచమినాటి తెల్ల వారు జామునే బయలుదేరి పూర్ణచంద్రపురం చేరుకున్నాడు.

పోటీ రోజుకు రాజకుమారులతో పాటు, కొందరు సాహసికులైన యువకులు కూడా, స్వయంవరం పోటీలో పాల్గొని రాకుమారిని వివాహమాడాలని ఉత్సాహంగా రాజధాని చేరుకున్నారు.

స్వయంవర వేదిక మీద రాజు ధీరసేనుడు, కాంచనవల్లి, మంత్రి కుసుమశర్మ ఆసీను లయ్యారు. స్వయంవరముహూర్తవేళ సమీ పించగానే, మంత్రి తన ఆసనం నుంచి లేచి, అక్కడ చేరిన వారితో, "ఈనాడు రాకుమారి స్వయంవరపోటీ అని మీకు తెలిసినా అది ఎలాంటి పోటీయో, ఈ క్షణం వరకూ మీరెరుగరు. ఇప్పుడు ఈ పోటీ



గురించి వివరిస్తున్నాను. పోటీలో పాల్గొన దలచినవారు, కోట దక్షిణదిశనున్న బురుజు పైకి ఎక్కి, అక్కడి నుంచి మూడు వరుసలలో ఏర్పాటు చేసిన కత్తుల వలయం మధ్యకు దూకాలి. కత్తుల మధ్య ఖాళీ ప్రదేశం నాలుగు గజాల వైశాల్యానికి మించి ఉండదు. ఇది ప్రాణాలతో చెలగాటమాడే పోటీ అని, నేను వేరుగా చెప్పనవసరం లేదు. అయినా – రాకుమార్తెను వివాహమాడాలంటే, ఆమాత్రం అపాయానికి సిద్ధపడకపోతే ఎలా? అందాలరాసి రాకుమారి కాంచనవల్లిని ప్రాణాధికంగా ప్రేమించిన వీరులారా! ముందుకు వచ్చి పోటీలో పాల్గొనండి!" అన్నాడు గంభీరంగా.



మంత్రి మాట్లాడడం ముగించగానే, సభాస్థలిలో సూది పడితే వినిపించేంత నిశ్శబ్దం అలుముకున్నది. తర్వాత సభలో గుసగుసలు బయలుదేరినై. "ఇదెక్కడి పోటీ? కోట బురుజు మీది నుంచి కత్తుల వలయం మధ్యకు దూకడమంటే ఆత్మహత్యా ప్రయత్నమే అవుతుంది. వీరుల సాహసాన్ని పరీక్షించదలిస్తే, కత్తి, మల్లయుద్ధం లాంటివి ఏర్పాటు చేయవచ్చు గదా! ఈ రాజేమయినా దేశదేశాల రాకుమారుల్ని మూకఉమ్మడిగా హత్య చేయదలచుకున్నాడా? లోకం రాకుమార్తెలకు గొడ్డుపోయిందా? ఇలాంటి ప్రమాదకరమైన పోటీలో పాల్గొని ప్రాణాలకుముప్పు తెచ్చుకోవడం మూర్ఖత్వం!" అనుకోసాగారు.

అయితే, మొదట పోటీలను చూడాలన్న కుతూహలంతో స్వయంవరానికి వచ్చిన విరూపుడి ఆలోచన ఇప్పుడు మారిపోయింది. వాడు, మనసులో ఒక దృఢనిశ్చయానికివచ్చి, సభ మధ్యలోంచి లేచి, రాజు ముందుకు వెళ్ళి, "మహారాజా! నేను ఈ పోటీలో పాల్గొనడానికి సిద్ధంగా ఉన్నాను!" అన్నాడు.

రాజు ధీరసేనుడు, రెండు చేతులూ లేని విరూపుడినితేరిపార చూసి ఆశ్చర్యపోయాడు. ఒకవేళ ఈ పోటీలో విరూపుడు కృతార్థుడయితే - అప్పుడు తన కుమార్తె భవిష్యత్తు తలుచుకుని, ఆయన మనసులోనే కుమిలిపోయాడు. ఆయన ఒకటి, రెండు క్షణాలు మౌనంగా ఊరుకుని, తర్వాత పెద్దగా నిట్టూర్చి, "అలాగే! నీ ఇష్టం," అన్నాడు.

ఇంతమంది రాకుమారులలో చివరికి విరూపుడిలాంటి అవిటివాడు పోటీకి నిలబడడంచూసి, రాకుమారి వెలవెల పోయింది.ఇది ఆమె ఊహించని పరిణామం. స్వయంవర నిబంధనల ప్రకారం, ఆమె విజేతను వివాహమాడక తప్పదు!

"అయినా, ఈ అవిటివాడు కోట బురుజు పైనుంచి కత్తులవలయంలోనికి దూకి, ప్రాణాలతో బయటపడడం అసంభవం," అనుకుంటూ రాకుమారి కొంత ఊరట చెందింది.

రెండు చేతులూ లేని ఒక సామాన్యుడు పోటీకి సిద్ధపడటం రాకుమారులకు అవమానం అనిపించింది. వాళ్ళల్లో ఒకడు బిగ్గరగా,

"ఒరే! ఏ తల్లి కన్న దురదృష్ట వంతుడివో నువ్వు, కాస్త వెనకా ముందూ ఆలోచించుకో. కోతికొమ్మచ్చి ఆటక్కూడా పనికిరాని నువ్వు కోటబురుజు పై నుంచి కత్తులవలయం మధ్యకు దూకడం అంటే – కోరి చావును కొనితెచ్చుకోవడమే!" అని హెచ్చరించాడు.

విరూపుడికి ఈ మాటలు వినిపించాయి. కానీ, వాడి మనస్థితి అవేమీ పట్టించుకునే స్థితిలో లేదు. వాడు మెల్లిగా కోట దక్షిణ దిశగా నడిచి, అక్కడ కోటగోడకు ఆనించి ఉన్ననిచ్చెన కేసి నిస్సహాయంగాచూడసాగాడు.

ఇది గమనించిన మంత్రి దాపులనున్న ఇద్దరు భటులను ఆజ్ఞాపించాడు. భటులు విరూపుణ్ణి పట్టుకుని జాగ్రత్తగా వాణ్ణి నిచ్చెన ద్వారా కోట బురుజు పైకి చేర్చారు. అక్కడి నుంచి చూస్తే వాడికి, కింద ఉన్న కత్తుల వలయం వధ్యస్థలిలా కనిపించింది. కాళ్ళు సన్నగా వణికాయి. భయంతో ఒళ్ళంతా చెమటలు పట్టసాగింది. గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభించింది. పోటీ నుంచి విరమించుకుంటే ప్రాణాలు దక్కించుకో వచ్చనిపించింది. అయితే, ఆ మరుక్షణం తన ఆలోచనకు వాడు ఎంతగానో సిగ్గు పడ్డాడు.

కింద సభాస్థలిలో ఉన్న జనం, అబ్బుర పడుతూ తనకేసి చూస్తూండడం విరూపుడు గమనించాడు. కొన్ని వందల జతల కళ్ళు దృష్టిని తనవైపు కేంద్రీకరించడం, వాడికి అబ్బురం అనిపించింది. ఒక్క క్షణం మనసు లోతన ఇష్టదైవాన్ని స్మరించుకుని, వాడు





బురుజు పైనుంచి కత్తుల వలయం మధ్యకు దూకాడు.

రాకుమారులతో పాటు, ఈ వింత స్వయం వరాన్ని చూడవచ్చిన ప్రజలందరూ,ఒక్కక్షణం నివ్వెరపోయారు. ఆ మరుక్షణం కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. అదృష్టవశాత్తూ విరూపుడు సరిగ్గా కత్తుల వలయం మధ్య నున్న ఖాళీ ప్రదేశంలో దూకడంతో స్వల్ప గాయాలతో బయటపడ్డాడు.

రాకుమారి కాంచనవల్లి నివ్వెరపోయింది. విరూపుడు వంటి అవిటివాడు చివరకు ఈ పోటీలో విజేతగా నిలిచి, తనకు భర్తఅవు తాడని ఆమె కలలో కూడా ఊహించలేదు. సాహసికుడైన ఏ అందాల రాకుమారుడో పోటీలో నెగ్గి తనను చేపడతాడని ఆమె ఆశించింది. స్వయంవరంలో విజేతనుపరి ణయమాడడం క్షత్రియ సంప్రదాయం. దాన్ని అతిక్రమించడం భావ్యం కాదు.

కాంచనవల్లి ఈ విధంగా మనసులో మధనపడుతూండగా, రాజు ధీరసేనుడు తన కుమార్తె జీవితం బుగ్గిపాలయిందనుకుని పెద్దగా నిట్టూర్చాడు.

వారిద్దరి ఆలోచనలను పసిగట్టినట్టు విరూపుడు నెమ్మదిగా వేదిక ముందుకువచ్చి రాజుకు నమస్కరించి, "మహారాజా! నేను యువరాణిని వివాహమాడడానికి సిద్ధంగా లేనందుకు మన్నించండి. నేను పోటీలో పాల్గొనడానికి కారణం, మీ కుమార్తెను వివాహమాడడం కానే కాదు. ఈ పోటీలో గెలుపొందినందుకు నాకు దొరికిన బహుమతి అమూల్యమైనది!" అని రాజుకు వినయంగా చెప్పుకుని అక్కడి నుంచి వెనుదిరిగి వెళ్ళి పోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా,విరూపుడి ప్రవర్తన ఒక ఉన్మాది ప్రవర్తనలా ఉన్నది గదా? యువరాణిని పరిణయమాడే ఉద్దేశం లేనప్పుడు, ప్రాణాంతకమైన పోటీలోవాడెందు కుపాల్గొన్నాడో అర్థం కావడం లేదు. పైగా పోటీలో గెలిచినందుకు తనకేదో అమూల్య మైన బహుమతి దక్కిందనడం ఏదో పిచ్చివాడి ప్రేలాపనగా కనబడుతున్నది. అలా కానప్పుడు - సిరిరా మోకాలడ్డినట్టు కాంచనవల్లిని

వివాహమాడి, పూర్ణచంద్రపురానికి భవిష్య త్తులో రాజయ్యే అవకాశాన్ని చేజేతులా జార విడుచుకుంటాడా! ఇది విధి వంచితమే గదా! ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడాచెప్పక పోయావో, నీతలపగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "విరూపుడు అంగ వైకల్యంతో జన్మించిన దురదృష్టవంతుడు. చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకుని, సవతి తల్లి చేత – ఏ పనికీ పనికిరాని వాడనీ, భూమికి భారం, బ్రతకడం వ్యర్థం అనీ రోజూతిట్ల కూ,అవమానాలకూ గురవుతున్నవాడు. అలాంటివాడిలో అవకాశం దొరికితే ఏదైనా ఒక ఘనకార్యం చేసి నలుగురి చేతా పొగి డించుకోవాలన్న ఆకాంక్ష రగులుతూఉం టుంది. అలాంటి అవకాశం వాడు ఊహిం చని విధంగా, రాకుమారి స్వయంవరం కల్పించింది. వాడి కోరిక రాకుమారిని వివా హమాడడం కానేకాదు. ఆమెకు తాను ఎందునా సరిజోడు కాదని వాడికి తెలుసు. అంతే కాకుండా, రాజ్యపాలన అంటే, ఏదో గాలివాటంగా, పిచ్చి తెగింపుతో పోటీలో నెగ్గుకొచ్చినంత సులభంకాదని వాడు గ్రహిం చాడు. కత్తి పట్టను ఒక చెయ్యి కూడా లేని తను యుద్ధాల్లో ఎలా పాల్గొన గలడు? ఇవన్నీ ఎరిగినవాడు కనుకనే విరూపుడు, రాకుమారిని వివాహమాడేందుకు నిరాకరిం చాడు. కనుక, ఇందులో విధివంచితం ఏమీ లేదు. అందరి దృష్టిలో ప్రముఖ వ్యక్తిగా గుర్తింపు పొందేందుకే, వాడు పోటీలో పాల్గొన్నాడు. పోటీలో గెలిచినందుకు వాడికి దక్కిన అమూల్యమైన బహుమతి – తన సాహసాన్ని గురించి అంతా కథలుగా చెప్పు కోవడం. ఇది సాధించానన్న వాస్తవాన్ని గుర్తించగానే, రాకుమారితో వివాహాన్ని తిరస్క రించి వెళ్ళిపోయాడు. ఇందువల్ల విరూపుణ్ణి పిచ్చివాడు, ఉన్మాది అనుకోవడం ఏమాత్రం సమంజసం కాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం:రాఘవరాజుపట్టాభిరామరాజురచన]



# పరస్పర విశ్వాసం

గంగరాజు, దామోదరానికి విశ్వాసపాత్రుడు. పదేళ్ళు పనిచేసినా జీతం పెంచలేదని విసిగిపోయిన గంగరాజు, దామోదరాన్ని విడిచి కోటయ్య వద్ద చేరాడు. కోటయ్య వాడికి దామోదరం కంటే రెట్టింపు జీతమిచ్చేవాడు.

దామోదరం సీతన్న అనేవాడిని పనికి కుదుర్చుకుని వాడితో, "ఒరేయ్, గంగరాజు నా దగ్గర పదేళ్ళు పని చేశాడు. అయినా వాడికి విశ్వాసం లేకపోయింది. పనివాడికి విశ్వాసం ముఖ్యం! ఈ విషయం గుర్తుంచుకో!" అన్నాడు.

సీతన్న ఒకరోజున గంగరాజును కలుసుకుని, "నువ్వు దామోదరం దగ్గర పదేళ్ళు పని చేశావు కదా! ఆయన దగ్గర ఎలా మసలుకోవాలో చిట్కాలుంటే చెప్పు," అన్నాడు.

"దామోదరం దగ్గర చిట్కాలెందుకూ! ఆయన చాలా మంచివాడు. నీకే యిబ్బందీ వుండదు," అన్నాడు గంగరాజు.

"ఆయనంత మంచివాడైతే పనెందుకు మానుకున్నావు? ఆయన పట్ల విశ్వాసం లేకుండా కాసింత డబ్బుకాశపడి కోటయ్య దగ్గర చేరిపోయి, మన పనివాళ్ళకే మచ్చ తెచ్చావు కదా?" అన్నాడు సీతన్న.

"అదేం కాదు. దామోదరం మంచివాడే కానీ విశ్వాసం లేదు. యజమానికి విశ్వాసం ముఖ్యం! విశ్వాసం లేని యజమాని వద్ద ఎక్కువకాలం పని చేయడం కష్టం కదా!" అన్నాడు గంగరాజు.

—రాయవరపు ఆదినారాయణరావు



# బొంబాయి-శివార్లు



రచన: మీరానాయర్
చిత్రాలు: గౌతమ్‌సేన్

## మొట్టమొదటి రైలుప్రయాణం

మన దేశంలోని మొట్టమొదటి రైలుమార్గమైన 'ది గ్రేట్ ఇండియన్ పెనిన్సులా రైల్వే'– బొంబాయి నగరంలోనే 1853వ సం॥ ఏప్రిల్ 16వ తేదీన ప్రారంభమయింది. ఆ రోజు సాయంకాలం మూడున్నర గంటలకు 400 ప్రయాణీకులతో బోరీబందర్ నుంచి థానేకు బయలుదేరిన రైలుబండిని చూడడానికి రైలు మార్గానికి ఇరువైపులా వేలాదిమంది ప్రజలు అమితాశ్చర్యంతో గుమిగూడారు. బోరీబందర్ స్టేషన్ మొదట దృఢమైన కలపచెక్కలతో నిర్మించబడింది. కాని ఆ తరవాత అక్కడ అందంగా రూపొందించిన విక్టోరియా టెర్మినస్ నిర్మాణం జరిగింది. అంతకుపూర్వం ఆ స్థానంలోనే బొంబాయి అధిష్ఠాన దేవత ముంబాదేవి ఆలయం ఉండేది. ఆ దేవాలయాన్ని మూడుమైళ్ళ అవతలికి తరలించారు.

బొంబాయి నగరం నుంచి ఎలిఫెంటాకు హార్బరు మీదుగా మోటారు లాంచిలో కొంతదూరం వెళ్ళాలి. దారిలో 'బుచర్ ఐలండ్' కనిపిస్తుంది. ఒకప్పుడు బొంబాయిలోని బ్రిటిష్ వాళ్ళకు ఇక్కడినుంచి జంతుమాంసాన్ని సరఫరా చేసిన రాబిన్ అనేవాడి కారణంగా



విక్టోరియా టెర్మినస్

దీనికీ పేరు వచ్చింది. ఇప్పుడు దీనిని క్రూడ్‌ఆయిల్ టాంకర్లు ఆపడానికి ఉపయోగిస్తున్నారు.

ఎలిఫెంటాలో ఏనుగులు లేవు. ఇక్కడ కోతులే కనిపిస్తాయి. 16 వ శతాబ్దంలో పోర్చుగీసులు ఇక్కడికి వచ్చినప్పుడు వారికి సముద్రతీరంలో బ్రహ్మాండమైన రాతి ఏనుగు శిల్పం ఒకటి కనిపించింది. అందువల్ల ఈ ప్రాంతానికి వాళ్ళు 'ఎలిఫెంటా' అని పేరు పెట్టారు. ఆ శిల్పాన్ని బ్రిటిష్‌వారి కాలంలో ఇప్పుడు జిజామాతా ఉద్యాన్ అని పిలువబడే విక్టోరియా గార్డెన్స్‌కు తరలించారు. అది ఇప్పుడూ అక్కడే ఉన్నది.

లాంచినుంచి దిగి అర కిలోమీటరు దూరం నడిచినట్టయితే, అక్కడ నిటారుగా ఉన్న మెట్లు మనల్ని, బండరాళ్ళలో మలిచిన శివాలయాల సముదాయం దగ్గరికి తీసుకువెళుతుంది. వాటిలో మన దృష్టిని మరింత ఆకర్షించేవి మహాగుహ ఆలయాలు. మానవ నిర్మితమైన ఈ మహాగుహకు మూడు ప్రవేశద్వారాలు ఉన్నాయి. వాటిలో ఒక ద్వారానికి అభిముఖంగా 5.45 మీటర్ల ఎత్తులో మూడు శిరస్సులతో బ్రహ్మాండమైన శివుడి విగ్రహం ఉన్నది. పరమశివుణ్ణి సృష్టి, స్థితి, లయాలకు

ఆలయంలో
శిథిలమైన విగ్రహాలలో
ఒకటి



ఎలిఫెంటాలో
సుప్రసిద్ధమైన
సృష్టి, స్థితి, లయ కారకుడైన
త్రిమూర్తి విగ్రహం



మూలకారణంగా చూపే త్రిమూర్తి విగ్రహం ఇది.
గుహ గోడలమీద కొన్ని పురాణఘట్టాలు కుడ్యశిల్పాలుగా మలచబడి ఉన్నాయి. రావణుడు కైలాసగిరిని కదిలించడానికి ప్రయత్నిస్తూంటే – పరమశివుడు ఏ మాత్రం చలించకుండా పార్వతీదేవితో విలాసంగా పాచికలాడుతూ, కాలి బొటనవేలితో కైలాసగిరిని నొక్కిపట్టే దృశ్యం చాలా అద్భుతంగా మలచబడి ఉన్నది.
శివపార్వతుల కల్యాణం, అర్ధనారీశ్వర రూపం, గంగావతరణ ఘట్టం – మొదలైన కుడ్యశిల్పాలు కూడా అంతగా పాడవకుండా ఉన్నాయి. శివరాత్రి సమయంలోనూ, శివ సంబంధమైన ఇతర పర్వదినాలలోనూ ఇక్కడ ఉత్సవాలు కోలాహలంగా జరుగుతాయి. పగటిపూట సంతలూ, సాయంకాలం వేళ సాంస్కృతిక కార్యక్రమాలూ జరుగుతాయి.
మహాగుహకు సమీపంలో మరీ శిథిలమై పోయిన రెండు గుహలు ఉన్నాయి. దీవిలోని మరో కొండమీద సీతాబాయి దేవళ అనే, మరొక గుహ ఉన్నది. అక్కడ ఒకప్పుడు అందమైన ద్వారం, పాలరాతి మంటపం ఉండేవి. ఈ గుహ మొదటి కొండమీది గుహలలాగా మరీ శిథిలమై పోకుండా కొంతవరకు రక్షింపబడి ఉన్నది. ఎలిఫెంటాకు దక్షిణంగా కొంకణతీరంలో బొంబాయి వాసులు ఎంతగానో అభిమానించే అలీబాగ్ బీచ్ రిసార్ట్ ఉన్నది.
అలీబాగ ఒక రేవు పట్టణం. 17వ శతాబ్దంలో ఆ ప్రాంతంలో బావులు త్రవ్వించి, ఉద్యానవనాలు నిర్మించిన



లోపలి మంటపంలో రాతితో మలచిన స్తంభాలు





శివపార్వతుల కల్యాణం

కైలాసగిరిమీది శివుడు

అలీబేగ్ అనే ఒక సంపన్న మహమ్మదీయుడి కారణంగా దీనికీ పేరు వచ్చింది. ఆయన నిర్మించిన ఉద్యానవనాలు ఇంకా ఉన్నాయి. ఇక్కడ కాచే కొబ్బరికాయలు, అంటుమామిడి కాయలు కొంకణ ప్రాంతంలో కెల్లా చాలా శ్రేష్ఠమైనవి.

అలీబాగ్ తాలూకా పరిధిలో చావూల్ అనే పట్టణం ఉన్నది. దీనిని పూర్వకాలంలో చంపావతి, రేవతిక్షేత్ర అని పిలిచేవారు. ఆ కాలంలో ఇక్కడి నుంచి రోముతో వర్తక వ్యాపారాలు జరిగాయి.

అలీబాగ్ బీచ్

14వ శతాబ్దంలో కూడా ఇది రేవుపట్టణంగా ప్రసిద్ధి గాంచింది. పోర్చుగీసులు ఆక్రమించిన తరవాతే దీనికి ఇప్పటిపేరు ఏర్పడింది. చక్కటి ఓడరేవుగానూ, విస్తారమైన వర్తకవాణిజ్యాలకు కేంద్రంగానూ ఇది ప్రసిద్ధి గాంచింది.

దీనికి దక్షిణంగా కొన్ని మైళ్ళ అవతల రాళ్ళదీవి మీద జంజీరా కోట ఉన్నది. ఈ కోట గోడలు సముద్రజలాల నుంచి 15 మీటర్ల ఎత్తు ఉన్నాయి. ఈ కోటను 1707వ సం॥లో మాలిక్ అంబర్ అనే ఒక అబిసీనియన్ నిర్మించాడు. అబిసీనియా (ఎథియోపియా) నుంచి వచ్చిన అంబర్ మహారాష్ట్రకు చెందిన దీవిలో కోట ఎలా నిర్మించ గలిగాడు? దీని కథ 1489వ సం॥ వరకు వెళుతుంది. ఆ సంవత్సరం అబిసీనియా నుంచి వచ్చిన ఒక సాహస యాత్రికుడు తనను ఒక వర్తకుడని చెప్పుకుని, ఆ దీవిలో 300 పెట్టెలు దించడానికి, ఆ ప్రాంతాన్ని పాలించే రాజునుంచి అనుమతి పొందాడు. ఆ పెట్టెలలో సైనికులు ఉన్నారన్న విషయం ఆ పాలకుడు గ్రహించలేక పోయాడు. ఉపాయంతో దీవిని పట్టుకున్న అబిసీనియన్లు అక్కడ కోటను నిర్మించారు. 1947వ సం॥లో అది సమైక్య భారతదేశంలో విలీనం అయ్యేంత వరకు వాళ్ళు దానిని తమ ఆధీనంలోనే ఉంచుకున్నారు. అబిసీనియన్లు తమను 'సయ్యెద్'లు అని చెప్పుకున్నారు. వారే కాలక్రమేణా 'సిద్దీలు' గా మారారు. అరబిక్ భాషలో 'జజీరా' అంటే దీవి. అదే కాలక్రమేణా 'జంజీరా'గా నామాంతరం చెందింది.



జంజీరా కోట



# పుట్టింటి దేవత!

అంతగా ఆస్తిపరులు కాని, ఒక సామాన్య కుటుంబంలో పుట్టిన బంగారమ్మకు చిన్నప్పట్నుంచీ నగలంటే పిచ్చిమోజు. ఆమె యుక్త వయస్కురాలయ్యాక, తల్లిదండ్రులామెను జమీందారుగారి కచ్చేరిలో గుమాస్తా ఉద్యోగం చేస్తున్న వెంకటరమణ అనే అతడికి ఇచ్చి పెళ్ళిచేశారు.

కాపురానికి వచ్చినప్పటి నుంచీబంగారమ్మ, భర్త వెంకటరమణను ఏవేవో నగలు చేయించమంటూ కోర సాగింది. వెంకటరమణ మొదట్లో నవ్వి ఊరుకునేవాడు. కాని రానురాను ఆమె నగలపిచ్చి వేధింపుస్థాయికి చేరేసరికి, వెంకటరమణ ఇక ఊరుకుని లాభం లేదనుకుని, "మన తాహతుకుతగిన నగలేవో నీకుండనే ఉన్నవి. నీకు వడ్డాణాలూ, చంద్ర సూర్యహారాలూ చేయించడానికి నేనేం జమీందారును కాను. ఆయన కచ్చేరీలో మామూలు గుమాస్తాని. ఉన్నవాటితో తృప్తిపడి, నీ బంగారంపిచ్చి మానుకో," అని గట్టిగా కోప్పడ్డాడు.

బంగారమ్మ చేసేదేమీ లేక ఊరుకున్నది. అయితే, ఆమె నగలపిచ్చి మాత్రం మనసును తొలుస్తూనే ఉండేది.

ఇలా కొన్నేళ్ళు జరిగిపోయాయి.బంగారమ్మ ఒకే ఒక్క కొడుకు గోవిందుకు బాగా చదువుసంధ్యలబ్బి, అతడు కచ్చేరీలో ఉద్యోగం సంపాదించిన కొద్దిరోజుల్లోనే, వెంకటరమణ తీరని అనారోగ్యానికి గురయి ఉద్యోగం మానుకుని ఇంటిపట్టునే ఉండసాగాడు.

కొడుకు గోవిందు ఉద్యోగం బంగారమ్మలో తిరిగి బంగారంపిచ్చిని రగిల్చింది. వాడికి పెద్ద కట్నం తీసుకుని పెళ్ళి చేసి, ఆ డబ్బులతో వడ్డాణం, మెడకు రెండుపేటల నానుతాడుతో పాటు ఇంకేవేవో నగలు చేయించుకోవాలని ఆలోచన చేయసాగింది.

మాచిరాజు కామేశ్వరరావు



బంగారమ్మ కోపంతో వెనక్కు జరుగుతూ, "ఒరే! ఈ పిల్ల నీ భార్య కావచ్చు. కానీ నా కోడలు మాత్రం కాదు," అన్నది.

పక్కనే ఉన్న కమల తండ్రి, "అలా కోప గించుకోకండి, అక్కయ్యగారూ! మా కమల నచ్చడంతో, మేము కానీకట్నం ఇచ్చుకోలేమని తెలిసినా, పెద్దమనసుతో ఈ పెళ్ళి చేసుకు న్నాడు అల్లుడుగారు," అన్నాడు.

"ఓహో, కానీకి గతిలేని దరిద్రపుగొట్టు సంబంధమన్నమాట!" అన్నది బంగారమ్మ మరింత కోపంగా.

అప్పుడు కమల తల్లి కల్పించుకుని, "పెద్దవారు మీరు లేకుండా పెళ్ళి జరిపిం చడం తప్పే! దగ్గర్లో ముహూర్తాలు లేవని అల్లుడుగారు పట్టుబట్టారు. మమ్మల్ని క్షమిం చండి వదినగారూ!" అంటూ బంగారమ్మ చేతులు పట్టుకున్నది.

బంగారమ్మ తన చేతుల్ని విదిలించుకుని, "అడ్డమైనవాళ్ళు వరసలు పెట్టి పిలుస్తూంటే, ఒంటిమీద తేళ్ళు, జెర్రులు పాకుతున్నట్టుంది. పిల్లని ఇక్కడ వదిలి, తిరిగి చూడకుండా ఊరొదిలి పొండి," అన్నది.

కమల తల్లిదండ్రులు కళ్ళనీళ్ళు పెట్టుకుని, కూతురికేసి జాలిగా ఒకసారి చూసి అక్కడి నుంచి వెళ్ళిపోయారు.

ఇది జరిగినప్పుడు బంగారమ్మ భర్త ఇంట్లో లేడు. అక్కడికి నాలుగు కోసుల దూరంలో ఉన్న ఒక ఊరుకు హిమాలయాల నుంచి

అయితే, ఆమె ఆలోచనలకు భిన్నంగా గోవిందు పెళ్ళి జరిగిపోయింది. అదెలాగంటే- గోవిందు తన స్నేహితుడి పెళ్ళికి దూరగ్రామం వెళ్ళాడు. ఆ పెళ్ళిలో కమల అనే అమ్మాయి వాణ్ణి బాగా ఆకర్షించింది. ఇక రెండుమూడు నెలలవరకూ ముహూర్తాలు లేవని తెలుసు కున్న గోవిందు, కమల తల్లిదండ్రుల అంగీకా రంతో, స్నేహితుడి పెళ్ళి ముహూర్తానికే తనూ కమలను పెళ్ళి చేసుకుని, ఆమెను వెంటబెట్టుకుని ఇంటికి వచ్చాడు.

కమలను చూసి ఆశ్చర్యపోతున్న తల్లితో గోవిందు, "అమ్మా! నీ కోడలు. మమ్మల్ని ఆశీర్వదించు," అంటూ బంగారమ్మ పాదాలకు నమస్కరించబోయాడు.

ఒక బైరాగి వచ్చాడని, ఆయన ఎటువంటి వ్యాధినైనా, ఒకేరకం మందుతో, ఒకే మోతాదుతో నయంచేస్తున్నాడనీ నీలివార్తగా విని, ఆశకొద్దీ ఆ బైరాగిని చూడబోయాడు.

ఆ మర్నాడు ఇంటికి తిరిగొచ్చిన వెంకటరమణ, గోవిందు ద్వారా సంగతి విని, "నాకు అదృష్టం లేదు. ఆ బైరాగి వారం క్రితమే గ్రామం వదిలి ఎటో వెళ్ళిపోయాడుట. మీ అమ్మ సంగతి ఎరిగి ఉండీ నువ్వు ఆమెకు చెప్పకుండా ఈ పెళ్ళి చేసుకోవలసింది కాదు," అన్నాడు విచారంగా.

బంగారమ్మ వారం తిరక్కుండా కోడలు కమల మీద కక్ష సాధింపుకు పూనుకున్నది. ఇంటి పనిమనిషిని మానిపించింది. వంట పనుల నుంచి, బట్టలు ఉతకడం వరకూ అన్నీ కమల చేత చేయించడం మొదలు పెట్టింది.

ఇది చాలదన్నట్టు ఒకరోజు ఆమె,కమలతో, "కానీ కట్నం లేకుండా, మహారాణి వైభోగం అనుభవిద్దామని ఇక్కడికొచ్చావు. ఈ రోజు నుంచీ నీకు ఒంటిపూట భోజనమే. అదీ రాత్రిపూట నీ మొగుడితో. ఈ విషయాలు అబ్బాయికి చెప్పావంటే నీ మీద దొంగతనం కట్టి, శాశ్వతంగా పుట్టింటికి తరిమేయగలను," అని బెదిరించింది.

ఒంటిభోజనంతో వారం రోజులు తిరిగే సరికి కమల చిక్కి సగం అయ్యింది. ఒక రాత్రి భోజనాలప్పుడు గోవిందు, ఆమెను



"అదేం, అలా చిక్కి పోయావు?" అని అడిగాడు.

ఆ సమయానికి అక్కడికి వచ్చిన బంగారమ్మ, "తల్లిమీద బెంగ కాబోలు. రేపు తీసుకుపోయి పుట్టింట వదిలిరా," అన్నది గోవిందుతో.

అలాగే, అంటూ గోవిందు తలఊపాడు.

ఆ రాత్రి ఎంతకూ నిద్ర పట్టక, కమల నడిరాత్రి వేళ పెరట్లోకి వెళ్ళి, అక్కడ ఒక అరుగు మీద కూర్చుని, గయ్యాళిఅత్త పెట్టే బాధలను తలుచుకుని దుఃఖించసాగింది. హఠాత్తుగా పక్కనున్న బాదం చెట్టు ఆకులు గలగలమని శబ్దం రావడంతో, ఆమె తల ఎత్తి చూసింది.



పిశాచం ఒకటి బాదం చెట్టు కొమ్మల్లోంచి ఎగిరి ఆమె ముందు దూకుతూ, "భయపడకు, నీకు మేలు చేయడానికే వచ్చాను. ఎందుకు దుఃఖిస్తున్నావు?" అని అడిగింది.

ఆ మాటలతో ధైర్యం తెచ్చుకున్న కమల, అత్త బంగారమ్మ పెట్టే బాధలను గురించి పిశాచానికి చెప్పింది. అంతా విన్న పిశాచం ఒక్కక్షణం ఆలోచించి, "సరే! ఈనాటి నుంచి నువ్వు తిన్న వెయ్యి మెతుకుల అన్నానికి, ఒక మెతుకు బంగారుమెతుక వుతుంది. రోజంతా నువ్వు తిన్న భోజనాన్ని బట్టి, రాత్రి కడిగి బోర్లించిన నీ కంచం కింద బంగారు మెతుకులు ఉంటాయి. బంగారంపిచ్చి గల మీ అత్త, ఇక నీకుతిండి పెట్టకుండా మార్చదు," అంటూ అదృశ్యమై పోయింది.

మర్నాడు పుట్టింటికి ప్రయాణంకట్ట మంటూన్న బంగారమ్మతో కమల, రాత్రి తన పుట్టింటిదేవత చెప్పిందంటూ, పిశాచం అన్న మాటలు వివరించింది.

బంగారమ్మ, "ఔరా, నిజమా?" అంటూ కమల కేసి అనుమానంగా చూస్తూ, "నువ్వనే ఆ పుట్టింటిదేవత ఇంతకాలంఎక్కడ అఘోరి స్తున్నది? నువ్వు కాపురానికి వచ్చిన రోజునే ఈ సంగతి చెప్పి ఉంటే, ఈసరికి ఆరుపేటల బంగారుగొలుసు చేయించుకుని ఉండేదాన్ని. పాపం, ఈ దేవతకు మనింటి దారి కనుక్కో వడం కొంత కష్టమై ఉంటుంది. సరే, ఈ రోజుకు నీ పుట్టింటి ప్రయాణం ఆగి పోయింది," అన్నది.

ఆ రాత్రి అందరు పడుకున్నాక, కోడలి కంచం ఎత్తి చూసి బంగారమ్మ, దాని కింద ఉన్న రెండు బంగారు మెతుకులు చూసి పరమానందం చెందింది. అది మొదలు ఆమె కోడలి చేత మూడు పూటలా భోజనం చేయించేది. నెల తిరిగేసరికి బంగారమ్మ దొరికిన బంగారు మెతుకులు కరిగించి చెవులకు దుద్దులు చేయించుకుంది. కమలకు, తనకు పుట్టిల్లంటూ ఉన్న సంగతే మరిచిపొమ్మని చెప్పింది.

బంగారమ్మకు రోజురోజుకూ ఆశ పెరగసా గింది. కడుపు నిండిందని కమల చెప్పినా

వినకుండా, ఆమెచేత మరింత అన్నం తిని పించడం మొదలుపెట్టింది.

ఒకరాత్రి కమల కడుపునొప్పితోనూ, తల్లి దండ్రులను చూడాలన్న బెంగతోనూ దుఃఖిస్తూ, పెరట్లో ఉన్న అరుగుమీద కూర్చు న్నది.

ఆ సమయంలో పిశాచం హఠాత్తుగా ఆమె ముందు ప్రత్యక్షమై, "మళ్ళీ ఏం కష్టం వచ్చింది?" అని అడిగింది.

కమల సంగతి చెప్పగానే, అది పెద్దగా చిటిక వేసి, "ఇకనుంచీ, నువ్వు తిన్న అన్నం బంగారు మెతుకులు కావడం జరగదు. మీ అత్త ఒక పూట భోజనం మానితే, ఆమె కంచం కింద ఒక బంగారుకాసు ఉంటుంది," అని చెప్పి మాయమైంది.

తెల్లవారి ఈ సంగతి చెప్పగానే బంగారమ్మ, కమలతో, "అయితే, ఇంకా నువ్విక్కడెందుకు, తిండిదండగ!" అని, అప్పటికప్పుడు బాడుగ బండిలో ఆమెను పుట్టింటికి పంపేసింది.

ఆరోజు మధ్యాహ్నం భోజనం మానేసింది బంగారమ్మ.రాత్రి చూస్తే కంచం కింద మిలమిల మంటూ బంగారుకాసు! మర్నాడు రెండుపూటలా భోజనం మానేసింది. రెండు బంగారుకాసులు దొరికాయి.

దీనితో బంగారమ్మకు ఒక కొత్త ఆలోచన వచ్చింది. పుట్టినప్పటి నుంచీ రోజూ చేస్తున్న భోజనమే కదా! ఒక పదిరోజుల పాటు మా నేస్తే, ఇరవైకాసుల బంగారం దొరుకుతుంది. వాటితో ఛక్కగా వడ్డాణం చేయించుకుని, నెల రోజుల్లో జరగబోయే బంధువులింటి



పెళ్ళికి వెళ్ళి, అక్కడ అమ్మలక్కలందర్నీ మూర్ఛపోయేలా చేయొచ్చు!

ఇలా ఆలోచించి బంగారమ్మ పూర్తిగా భోజనం చెయ్యడం మానేసింది. మూడోనాటికల్లా ఆమెకు కంచంకింది బంగారు కాసులుతెచ్చుకునే ఓపిక పోయింది. ఈ స్థితిలో ఆమెకు మరొక వింత ఆలోచన వచ్చింది.

ఆమె, కొడుకు గోవిందును పిలిచి, "ఒరే, బాబూ! నువ్వు వెంటనే వెళ్ళి, వైద్యుడు ఘటికాచారిగారిని, ఏ సగ్గుబియ్యం జావో, బియ్యపుజావో తాగడం కూడా భోజనంకిందికే వస్తుందేమో అడిగిరా," అని ఆయాసపడుతూ చెప్పింది.

ఏమిటీ వింత అనుమానం, అనుకుంటూ గోవిందు వైద్యుడి దగ్గరకు వెళ్ళి బంగారమ్మ అడగమన్న ప్రశ్న అడిగాడు. దానికిఘటికాచారి నవ్వి, "ఒక్క నీరు తప్ప, ఏదితిన్నా భోజనం కిందికేవస్తుంది!" అన్నాడు.

గోవిందు ఇంటికి తిరిగివచ్చేసరికి బంగారమ్మ అపస్మారక స్థితిలో వున్నది. వాడు పొరుగింటివాళ్ళ చేత వైద్యుడికి కబురు పెట్టి, తల్లిని కాస్త కనిపెట్టి వుండమనితండ్రి వెంకటరమణను పురమాయించి, అత్తవారింటికి వెళ్ళి భార్య కమలతో సాయంకాలానికల్లా తిరిగి వచ్చాడు.

కమల, బంగారమ్మను చూస్తూనే దుఃఖం ఆగక బావురుమని, "ఏం జరిగిందత్తయ్యా?" అంటూ ప్రశ్నించింది. బంగారమ్మ, కమలను దగ్గరకుపిలిచి, ఆమె మంచంపక్కన కూర్చోగానే ఆప్యాయంగా తల నిమురుతూ జరిగింది చెప్పి, "బంగారంటాంటి కోడలివి ఇంట వుండగా, నేను కాని కూడని బంగారానికిఆశ పడి ప్రాణం మీదికి తెచ్చుకున్నాను. అయినా, వెర్రిగాని ఈ వయసులో నాకు మెడలో గొలుసులెందుకు? నడుముకు వడ్డాణమెందుకు? ఆ బంగారమేదో నువ్వు తీసుకుని నచ్చిన నగలేవో చేయించుకో. మీమామగారికి మాత్రం జరిగింది చెప్పకు; నవ్విపోగలడు," అన్నది.

ఆతర్వాత కమలచేసిన సపర్యలతో బంగారమ్మ నెల రోజులకు మామూలు మనిషయింది.





# వ్యత్యాసం

ఒకప్పుడు ఒక రాజు తన రాజ్యాన్ని ధర్మం తప్పకుండా పాలించేవాడు. ఆదర్శప్రాయుడైన రాజుగా ఆయనకు అంతులేని కీర్తి వచ్చింది.

ఒకనాడు ఆ రాజు వేటకు వెళ్ళాడు. వేట తమకంలో ఆయన తన పరివారానికి దూరమై, కీకారణ్యంలో చిక్కుకుని, దారితప్పి చాలా సేపు తిరగి, ఆకలి దప్పులతో ఒక ముని ఆశ్రమాన్ని ఎలాగో చేరుకున్నాడు.

ముని కళ్ళు మూసుకుని ధ్యానంలో ఉన్నాడు. రాజు ఆయనకు నమస్కారం చెబుతూ, "మహాత్మా! దారితప్పి అరణ్యంలో చిక్కుకుని, ఆకలిదప్పులతో బాగా అలిసి ఉన్నాను. ఇక్కడ తమ ఆశ్రమంలో కొంచెం సేపు విశ్రాంతి తీసుకోనిస్తారా?" అని అడిగాడు. ముని కళ్ళు తెరవకుండానే, "అవశ్యం తీసుకోవచ్చు. ఈ దేశాన్ని ఏలే రాజు ధర్మాత్ముడు. అందుచేత ఆకలి దప్పుల భయం లేదు. ఆశ్రమంలో ఏ కాయ తిన్నా, ఏ ఆకు తిన్నా రుచిగానూ, పుష్టికరంగానూ ఉంటుంది. వాటితో నీ ఆకలీ, దప్పీ తీర్చుకో," అన్నాడు.

రాజు ఆశ్చర్యపడి సమీపంలో ఉన్న చెట్టు కాయ ఒకటి కోసి నోట వేసుకున్నాడు. తియ్యగానూ, రుచిగానూ ఉన్నది. పుల్లగానూ. చేదుగానూ ఉండవలసిన కాయలూ, ఆకులూ కూడా తియ్యగా ఉండి, రాజును బాధించిన ఆకలిదప్పులు క్షణంలో తొలగిపోయాయి. శరీరంతో బాటు మనసుకూ ఎంతో తృప్తి కలిగింది. రాజు అక్కడే కొంతసేపు విశ్రాంతి తీసుకుని, సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఇంటికి వచ్చాక రాజుకు, తన ధర్మ పరిపాలన యొక్క మహత్తును లోకానికి తెలపాలని బుద్ధి పుట్టింది. ఆయన వెంటనే

తన సామంతులనూ, పెద్ద ఉద్యోగులనూ, పుర ప్రముఖులనూ విందుకు పిలిచాడు. విందుకు గాను వేపాకు పచ్చడీ, కాకరకాయలు వేసి పాయసమూ లాంటివి తయారు చెయ్యమని తన వంటవాళ్ళకు ఉత్తరు విచ్చాడు.

రాజుగారి ఉద్దేశం ఏదో ఉంటుందను కుని వంటవాళ్ళు ఆయన ఆజ్ఞాపించిన ప్రకారమే చేదుకాయలతో వంటకాలు తయారు చేశారు.

అందరితో పాటు రాజుగారు కూడా భోజనానికి కూర్చున్నారు. అయితే ఆయనకు గొప్ప ఆశాభంగం కలిగింది. తాను చేయించిన వన్నీ చేదువిషం! నోట పెడితే వాంతి వచ్చే సింది.

రాజుగారు విందు ఆపుచేయించి, మళ్ళీ వేరే వంట చేయించి, అందరికీ పెట్టించి, తన మానాన్ని కాపాడుకున్నాడు. కాని ఆనాడు ముని ఆశ్రమంలో ఏది తిన్నా రుచిగా ఎందుకున్నదో, ఈ నాడు అలా ఎందుకు లేదో ఆయనకు అర్థం కాలేదు. ఒకవేళ వంటవారే విందు పాడు కావడానికి కారణమై ఉంటారనుకుని, ఆయన వేపాకూ, కాకరకాయలూ తిని చూశాడు. అవి చేదుగానే ఉన్నాయి. అంటే వంటవాళ్ళ తప్పు లేదన్న మాట.

ఆ వ్యత్యాసానికి కారణం మునినే అడిగి తెలుసు కుందామని రాజు అప్పటికప్పుడే, బయలుదేరి ఆశ్రమానికి వెళ్ళి, మునితో జరిగిన సంగతంతా చెప్పి, "ఆనాడు ఏది తిన్నా రుచిగా ఉన్నది, ఈ నాడు ప్రతీ దానికీ దాని మామూలు రుచే ఉండడానికి కారణం ఏమిటి, స్వామీ?" అని అడిగాడు.

"ఆనాడు నువ్వే రాజువని తెలియక, నీ ధర్మశీలతను పొగిడాను. దాని మూలంగా నీలో గర్వాతిశయం కలిగింది. నీ మహిమను నువ్వే పరీక్షకు పెట్టావు. మహిమలు అప ద్ధర్మంగా కనబడతాయే గాని పరీక్షకు నిలవవు," అని ముని చెప్పాడు.

రాజు మునికి క్షమాపణలు చెప్పుకుని రాజధానికి తిరిగి వచ్చాడు. అటుతరవాత రాజు అణకువ తెచ్చుకున్నాడు.






అర్ధరాత్రి అయింది. జరాసంధుడు తన అతిథుల మాట గుర్తుంచుకుని యజ్ఞశాలకు వచ్చి, కృష్ణార్జునులతో, "అయ్యా, మీరు స్నాతకులు. స్నాతకులు పూల మాలలు ధరించరు. గంధాలు పూయరు. మీరీ రెండు పనులూ చేశారు. మీ భుజాల మీద ధనుస్సుల చిహ్నాలూ, కాయలూ కనబడుతున్నాయి. మీరు మా నగరంలోకి ద్వారం గుండా రాలేదు, ప్రాకారం దూకి వచ్చారు. మీరు బ్రాహ్మణ వేషంలో ఉన్న క్షత్రియులలాగా కనబడుతున్నారు. నిజంగా మీరెవరు? ఏ పని తలపెట్టి వచ్చారో చెప్పండి," అన్నాడు.

దానికి కృష్ణుడు, "బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు స్నాతకులు కావచ్చు. మేము క్షత్రియ స్నాతకులం. మా మహిమ చేత బ్రాహ్మణులుగా కనిపిస్తున్నాం. మిత్రుడి ఇంటిని ద్వారంలో నుంచి ప్రవేశించమనీ, శత్రుడి ఇంటిని ద్వారం లేనిచోట ప్రవేశించమనీ పెద్దలు చెబుతారు. నువ్వు శత్రువువు కనుక మేము ప్రాకారం దూకి వచ్చాం. నీతో మాకు గల పనికి పొసగనందున నీ పూజలు నిరాకరించాం. మా భుజబల శౌర్య పరాక్రమాలు నీకు చూపడానికే వచ్చాం," అన్నాడు.

జరాసంధుడు కృష్ణుడితో, "ఎంత ఆలోచించినా మీ పట్ల నాకు ద్వేష కారణం కనిపించడం లేదు. నేను మీ కెలా శత్రువు నయ్యాను? నిరపరాధిని శత్రువుగా భావించడం ధర్మవిరుద్ధం కదా?" అన్నాడు.

దానికి కృష్ణుడు, "ఒక మహనీయుడు తన కులధర్మం ఆచరించడానికి గాను నీతో

## 22. పాండవ దిగ్విజయం



యుద్ధం చెయ్యాలని ఉంటే సైన్యాలను తీసుకురండి. లేదంటే, మీలో ఒకరితో గాని, ముగ్గురితో గాని యుద్ధం చెయ్యడానికి నేను సిద్ధమే!" అన్నాడు. అతను తన కొడుకైన సహదేవుడికి పట్టాభిషేకం చేసి యుద్ధానికి సిద్ధపడి వచ్చాడు.

"మాలో నీ ఇష్టం వచ్చినవారితో యుద్ధం చెయ్యి," అన్నాడు కృష్ణుడు.

జరాసంధుడు బలగర్వంకొద్దీ భీముడితో యుద్ధానికి సిద్ధపడ్డాడు. అతను కిరీటం తీసి, జుట్టు ముడివేసి, వీరోద్రేకంతో భీముడితో యుద్ధానికి చేతులు కలిపాడు. ఇద్దరూ రెండు ఏనుగులలాగా మల్లయుద్ధం ప్రారంభించారు. నగరంలోని రకరకాల వాళ్ళు యుద్ధం చూడడానికి వచ్చారు. భయంకరమైన ఆ యుద్ధం కార్తీక శుక్ల పాడ్యమి నాడు ఆరంభమై త్రయోదశి దాకా సాగింది. చతుర్దశి నాటికి జరాసంధుడి పని అయి పోయినట్లు గ్రహించి కృష్ణుడు భీముడితో, "భీమా! జరాసంధుడి శక్తి పూర్తిగా పోయింది. ఇవాళే అతన్ని తుదముట్టించు," అన్నాడు.

ఈ మాట విని భీముడికి కొత్తబలం వచ్చింది. అతను ఆ రోజు జరాసంధుడిని అవలీలగా వశపరచుకుని, ఘోరంగా విరిచి చంపేసి, భయంకరంగా సింహనాదం చేసి, జరాసంధుడి శవాన్ని కాళ్ళు పట్టుకుని, ఈడ్చుకు వచ్చి, రాజగృహ ద్వారం వద్ద పడేశాడు.

తరవాత కృష్ణభీమార్జునులు చెరసాలకు వెళ్ళి, అందులో బంధించి ఉన్న రాజులందరినీ

యుద్ధం చెయ్యమని మమ్మల్ని ముగ్గురినీ పంపాడు. అకారణంగా అనేకమంది రాజులను చెరపట్టి, రోజుకొక్కడిని భైరవుడికి బలి ఇస్తున్న నువ్వు నిరపరాధి వెందుకు అవుతావు? ఇంతకన్న అధర్మం ఎక్కడ ఉంటుంది? నిన్ను చంపి నీ చేత బాధ పడేవారిని కాపాడవచ్చాం. నీలాగ గర్వించిన కార్తవీర్యుడి లాంటివాళ్ళు చెడ్డారు. నువ్వు చెరపట్టిన రాజులను విడిపించి, బాగుపడు. లేదా మాతో యుద్ధం చేసి చచ్చిపో. నేను కృష్ణుణ్ణి. వీరు భీమార్జునులు," అన్నాడు.

ఈ మాటలు విని జరాసంధుడు కోపోద్రిక్తుడై, "నా భుజబలంతో పోరాడి చెరపట్టిన రాజులను మీకు భయపడి విడిచి పెట్టుతానా? నాతో

విడిపించారు. గిరివ్రజంలో ఉన్న బ్రాహ్మణులు ఆ ముగ్గురినీ ఆశీర్వదించారు. చెర నుంచి బయటపడిన రాజులు కృష్ణుణ్ణి కీర్తించారు. కృష్ణుడు వారితో, "ధర్మరాజు రాజసూయం చేయబోతున్నాడు. మీరంతా అతనికి తోడ్పడాలి," అన్నాడు. అందుకు వారు సంతోషంగా ఒప్పుకున్నారు.

జరాసంధుడి కొడుకు సహదేవుడు రత్న కానుకలు తీసుకుని, పురోహితుడితో సహా వచ్చాడు. కృష్ణుడు అతడిచ్చిన కానుకలను తీసుకుని, అతన్ని మగధకు రాజుగా అభిషేకించి పంపేశాడు.

అనంతరం కృష్ణుడు జరాసంధుడి రథం మీద భీమార్జునులను కూర్చోబెట్టుకుని, చెర నుంచి విముక్తులయిన రాజులు వెంట రాగా, అతి శీఘ్రంగా ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చి, ధర్మరాజుతో, "దైవానుగ్రహం చేత నీ తమ్ములు క్షేమంగా తిరిగి వచ్చారు. మల్ల యుద్ధం చేసి భీముడి చేతిలో జరాసంధుడు చనిపోయాడు. వీరందరూ జరాసంధుడు చెర పట్టిన రాజులు," అని తెలిపాడు. ధర్మరాజు ఆ రాజులనందరినీ తగిన విధంగా ఆదరించి, వారి వారి దేశాలకు పంపేశాడు. తరవాత కృష్ణుడు జరాసంధుడి రథం మీదనే ద్వారకకు తిరిగి వెళ్ళిపోయాడు.

కొన్నిరోజుల అనంతరం ఒకనాడు అర్జునుడు ధర్మరాజుతో, "నాకు దివ్యమైన గాండీవమూ, అగ్నిదేవుడిచ్చిన రథమూ, అసాధారణమైన



యుద్ధసాధనాలూ ఉన్నాయి. నేను బయలుదేరి వెళ్ళి, దిగ్విజయం చేసి మన బొక్కసం నింపుతాను," అన్నాడు.

ధర్మరాజు ఆ మాటకు సంతోషించి, దిగ్విజయానికి మంచిరోజు నిర్ణయించి, ఉత్తరంగా అర్జునుడూ, తూర్పుగా భీముడూ, దక్షిణంగా సహదేవుడూ, పడమరగా నకులుడూ బయలుదేరి వెళ్ళి, దిగ్విజయం చేసి రావడానికి ఏర్పాటు చేశాడు. ధర్మరాజు మాత్రం రాజ్యపాలన చూసుకున్నాడు.

ఉత్తరంగా సైన్యంతో సహా బయలుదేరిన అర్జునుడు మొట్టమొదట పుళిందరాజును ఎదుర్కొని, అతన్ని తేలికగా ఓడించి, వరసగా ఆనర్త, కాలకూట, కుళింద, సుమండల



వుచ్చుకుంటూ, కానుకలు తీసుకుంటూ కింపురుషులనూ, గంధర్వులనూ జయించి, ఉత్తర కురుదేశాలలో ఉన్న హరివర్షం అనే దేశాన్ని చేరాడు. అతను దాన్ని జయించాలని చూశాడు. కాని అక్కడ ఉన్న ద్వారపాలకులు, "ఈ పురాన్ని జయించడం నీ తరం కాదు. మంచిగా వెనక్కి తిరిగి పో," అని అర్జునుడితో అన్నారు.

మహా దీర్ఘకాయులూ, మహా వీరులూ అయిన ఆ ద్వారపాలకులు అర్జునుడికి ఆ పురం గురించి ఇలా చెప్పారు. ఆ నగరాన్ని ప్రవేశించిన వారికి ఏమీ కనబడదు. మామూలు మనుష్య శరీరంతో ఆ పురాన్ని ప్రవేశించడం అసాధ్యం. "నీకు ఏం కావాలో చెప్పు. ఇస్తాం," అన్నారు ఆ ద్వారపాలకులు.

దేశాల రాజులను లోబరుచుకున్నాడు. మహా పరాక్రమవంతుడయిన శాకలద్వీప రాజు ప్రతివింధ్యుడు అర్జునుడికి ఓడాడు. ప్రాగ్జ్యోతిష రాజైన భగదత్తుడి పరివారంలో కిరాతులూ, చీనులూ ఉండేవారు. భగదత్తుడు అర్జునుడితో ఎనిమిది రోజులు యుద్ధం చేసి చివరకు స్నేహసంధి చేసుకున్నాడు.

అర్జునుడు భగదత్తుడితో, "మా అన్నగారైన ధర్మరాజు రాజసూయం చేసి సామ్రాజ్యం నిర్మించబోతున్నారు. అందుకు ఎంత ధనమైనా కావాలి. పుష్కలంగా ధనసహాయం చెయ్యి. నేనింకేమీ కోరను," అన్నాడు. భగదత్తుడు అతనికి ధనమిచ్చి, నమస్కరించాడు. అర్జునుడు అలా దారిన తగిలిన రాజులందరినీ జయించి కప్పాలు

ధర్మరాజు రాజసూయం చేసి సామ్రాజ్యం పొందబోతున్నాడనీ, అందుకు కప్పం కావాలనీ అర్జునుడు ద్వారపాలకులతో అన్నాడు. వాళ్ళు అంతులేని ధనాన్నీ, రత్నరాశులనూ, రకరకాల కంబళాలనూ, విచిత్రమైన జింక చర్మాలనూ తెచ్చి అర్జునుడికి కప్పంగా ఇచ్చారు. ఈ విధంగా అర్జునుడు ఉత్తరదిక్కును జయించి, తాను తెచ్చిన ధనరాశులనూ, ఇతర వస్తువులనూ భాండాగారంలో చేర్చాడు.

సైన్యంతో సహా తూర్పుగా బయలుదేరిన భీముడు పాంచాలరాజు మన్ననలు పొంది, మిథిలాపతిని యుద్ధంలో ఓడించి, దశార్ణ

రాజైన సుధన్వుడితో యుద్ధం చేసి, అతని అద్భుత శౌర్యాన్ని మెచ్చుకుని, అతన్ని తన సేనాపతిని చేసుకున్నాడు. తరవాత అతను రోచమాను డనేవాణ్ణీ, అతని తమ్ములనూ జయించి, పుళిందుడూ, సుకుమారుడూ, సుమిత్రుడూ అనే వారిని ఓడించి, చేదిదేశం చేరాడు.



చేది దేశపు రాజైన శిశుపాలుడు, ధర్మరాజు సామ్రాజ్యం సంపాదించనున్నాడని విని, చాలా సంతోషించి భీముణ్ణి కొన్ని రోజుల పాటు తన ఇంట ఉంచుకుని, వెళ్ళిపోయేటప్పుడు రాజసూయం కొరకు అంతులేని ధనం ఇచ్చాడు.

భీముడు అక్కడినుంచి బయలుదేరి అనేక రాజులను జయించుకుంటూ మగధ దేశానికి వచ్చి, సహదేవుడి నుంచి అంతులేని కప్పం పుచ్చుకుని, అతని సహాయం కూడా పొంది, పౌండ్రకవాసుదేవుణ్ణీ, ఇంకా అనేకమందినీ జయించి, సముద్రతీర వాసులతో ఒకేసారి యుద్ధం చేసి బంగారమూ, వెండీ, ముత్యాలూ, పగడాలూ, చందనమూ, సుగంధ ద్రవ్యాలూ, రత్నాలూ మొదలైనవి సంపాదించి ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చాడు.

దక్షిణంగా వెళ్ళిన సహదేవుడు, శూరసేన, మత్స్యదేశాలనూ, పటచ్చర దేశం వారినీ, నిషాదులనూ జయించి, తమ మేనమామ అయిన కుంతిభోజుణ్ణి సందర్శించి, ఆయన వద్ద విస్తారంగా ధనం పుచ్చుకున్నాడు. సహదేవుడింకా అనేక దేశాలనూ, రాజులనూ గెలిచి, మాహిష్మతీ పురానికి వచ్చి, దానికి రాజైన నీలుడనే వాడితో యుద్ధం చేస్తూండగా సహదేవుడి సేనలు తగలబడి పోసాగాయి.

ఇలా జరగడానికి కారణం ఉన్నది. ఒకప్పుడు మాహిష్మతీ నగర రాజైన నీలుడు తన కుమార్తెను అగ్నికార్యానికి వినియోగించాడు. అగ్నిదేవుడు ఆమె సౌందర్యానికి ముగ్ధుడై మోహించి, బ్రాహ్మణరూపం ధరించి ఆమెను సమీపించాడు. నీలుడీ సంగతి తెలిసి బ్రాహ్మణరూపంలో ఉన్న అగ్నిని దండించాడు. అప్పుడగ్ని తన నిజరూపాన్ని చూపాడు. నీలుడు అగ్నికి సాష్టాంగపడి తనను క్షమించమని వేడుకున్నాడు. తరవాత అతను తన కుమార్తెను అగ్నిదేవుడికిచ్చి శాస్త్రోక్తంగా

పెళ్ళి చేసి, తనకూ, తన పురానికీ శత్రు భయం లేకుండా అగ్నినుంచి వరం పొందాడు. అది మొదలు మాహిష్మతి పైకి శత్రుసేనలు వచ్చినప్పుడల్లా అగ్నిదేవుడు వాటిని దగ్ధం చేస్తూ వచ్చాడు.

సహదేవుడు దర్భాసనం మీద కూర్చుని, హోమం చేసి, అగ్నిని స్తుతించాడు. అగ్ని ప్రసన్నుడై, నీలుణ్ణీ, సహదేవుణ్ణీ పరిచయం చేసి, నీలుడి చేత సహదేవుడికి అంతులేని ధనం ఇప్పించాడు.

సహదేవుడింకా దక్షిణానికి పోయి, కళింగులనూ, ఓఢ్రులనూ, కేరళులనూ, ఆంధ్రులనూ దూతలను పంపి వశపరచుకుని, సముద్ర తీరాన రాక్షసరాజైన విభీషణుడి వద్ద విస్తారంగా కప్పం పుచ్చుకుని, ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చాడు.

ఇంద్రప్రస్థం నుంచి పడమరగా బయలుదేరిన నకులుడు రోహితక దేశపు రాజైన మయూరుణ్ణి జయించాడు. అక్కడినుంచి బయలుదేరి శైరీషక, మహేత్థ దేశాలను లోబరుచుకున్నాడు. దశార్ణ, శిబి, త్రిగర్త, అంబష్ఠ, మాళవ దేశాల రాజులు అతనికి ఓడారు. ఇంకా అనేక దేశాలను జయించుకుంటూ వెళ్ళి నకులుడు కృష్ణుడికి తన రాక తెలిపాడు. తరవాత అతను ముద్రదేశం ప్రవేశించి, శాకలపురం చేరుకుని, తన మేనమామ అయిన శల్యుడికి ధర్మరాజు తలపెట్టిన రాజసూయం గురించి చెప్పాడు. శల్యుడు చాలా సంతోషించి నకులుడికి విశేషంగా ధన కనక వస్తు వాహనాలిచ్చాడు.

నకులుడు సముద్ర మధ్యంలో ఉండే అనేక జాతులను జయించి, వరుణుడి పాలనలో ఉన్న దేశాన్నీ, కృష్ణుడు పూర్వం జయించిన దేశాలనూ తాను మళ్ళీ జయించి, తాను తెచ్చిన ధనరాసులతో ఇంద్రప్రస్థానికి తిరిగి వచ్చాడు.

నలుగురు తమ్ములూ నాలుగు దిక్కులనూ జయించి తెచ్చిన ధనంతో ధర్మరాజు వరుణుణ్ణీ, కుబేరుణ్ణీ మించిన ధనవంతుడైనాడు. ఈ సంపద ఆధారంగా ఆయన రాజసూయ యాగం ప్రారంభించటానికి తీర్మానించాడు. ధర్మరాజు ఉద్దేశం గ్రహించి మంత్రులు రాజసూయం ప్రారంభించడానికి ఇదే తగిన సమయమని ప్రోత్సహించారు.



# చందమామ కబుర్లు

## చెట్టుకూ చెట్టుకూ పెళ్ళి !

పై శీర్షిక చదవడానికే వింతగా ఉన్నదా ? అదెలా సాధ్యం అనిపిస్తున్నదా ? నిజంగానే ఈ పెళ్ళి కేరళ రాష్ట్రం పాలఘాట్ జిల్లా మలక్కుళంలో జరిగింది. దీనిని గురించి సాంతం తెలుసుకోవాలంటే మనం పదమూడేళ్ళు వెనక్కు వెళ్ళాలి. కేళన్ అనే రైతూ, వేలప్పన్ అనే ప్రధానోపాధ్యాయుడూ స్నేహితులు. వారు ఊరిపొలిమేరలో చెరొక మర్రిమొక్కనూ, వేపమొక్కనూ నాటారు. వాటిని తమ కొడుకూ, కూతురుగా భావించి, అవి పెరిగి పెద్దవయితే రెంటికీ పెళ్ళి జరిపించాలని సరదాగా అనుకున్నారు. స్నేహితులు వాటిని నీళ్ళు పోసి జాగ్రత్తగా పెంచసాగారు. పదమూడేళ్ళయింది. దురదృష్టవశాత్తు వేలప్పన్ మరణించాడు. అయితే, కేళన్ మిత్రుడు నాటిన మర్రిచెట్టు బోదెకు గట్టు వేసి కాపాడుతూ వచ్చాడు. ఆ ప్రాంతంలో ప్రజలు మర్రిచెట్టును శివుడి అంశగానూ, వేపచెట్టును పరశురాముడి తల్లి అయిన రేణుకాదేవి అంశగానూ భావిస్తారు. కాబట్టి మలక్కుళంలో ఆ చెట్లను భక్తితో చూస్తూవచ్చారు. కాని కొందరు, దారికి అడ్డంగా ఉన్నాయని ఆ చెట్లను పడగొట్టాలని ప్రయత్నించడంతో తీవ్ర వ్యతిరేకత బయలుదేరింది. ఆ తరవాత రెండు చెట్లకూ పెళ్ళి జరిపించాలనుకున్నారు. పెళ్ళిరోజు రెండు చెట్లనూ పూలమాలలతో అలంకరించారు. స్థానిక పూజారి పూజలు జరిపి, మేళతాళాలతో వేపచెట్టుకు బంగారు మాంగల్య ధారణ జరిపించాడు. పెళ్ళి విందులో 400 మందికి పైగా పాల్గొన్నారు. తన స్నేహితుడికిచ్చిన మాటనిలుపుకున్న కేళన్--ఆ దృశ్యాన్ని చూసి ఎంతో ఆనందించాడు.

## సామాన్యుల వాహనం

ముప్పై, నలభై యేళ్ళ క్రితం సైకిలును పేదవాళ్ళ వాహనంగా చెప్పుకునేవారు. మోటారు కారును, మోటారు బైకును సంపన్నులు మాత్రమే ఉపయోగించే వారు. ఆ తరవాత మరి కొందరికి అందుబాటులో ఉండే స్కూటర్లు వచ్చాయి. ఇవి ఇటలీ నుంచి వచ్చాయి. ఆ తరవాత మరికొందరికి అందుబాటు ధరలలో చిన్న కార్లు వచ్చాయి. ఇన్ని వచ్చినా సైకిళ్ళ తయారీ మాత్రం 1970 నుంచి యేడాదికి యేడాది పెరుగుతూనే ఉన్నది. 1994వ సం॥లో ప్రపంచం మొత్తం మీద 110,000,000 సైకిళ్ళు తయారయ్యాయి. వీటిలో 43,000,000 సైకిళ్ళు చైనాలోనే తయారయ్యాయి. సైకిళ్ళ తయారీలో మన దేశం రెండవ స్థానంలో ఉన్నది. సైకిళ్ళు ఎక్కువ సంఖ్యలో తయారవడానికి కారణం – ఉపయోగించడంలో సౌలభ్యంతో పాటు, అది ఇంధనం అవసరంలేని వాహనం కావడమే. అందువల్ల వాతావరణ కాలుష్యానికీ, శబ్దకాలుష్యానికీ అవకాశం లేదు. ఇంధనం ఉపయోగించే మోటారు వాహనాలను కొన్ని దేశాలు కొన్ని నిర్ణీత ప్రదేశాలలో అనుమతించడంలేదు. కొన్ని విశ్వవిద్యాలయాల ప్రాంగణాలలోకీ, కొన్ని పరిశ్రమలు ఉన్న చోటికీ వాటిని అనుమతించడంలేదు. 400 అమెరికా పట్టణాలలో పోలీసులు గస్తీ తిరగటానికీ, పోస్టుమేన్లకూ సైకిళ్ళు ఇస్తున్నారు. ఇక మన దేశానికి వస్తే – పూనా, హైదరాబాదు, ఢిల్లీ నగరాలలో సైకిళ్ళను ఎక్కువగా ఉపయోగిస్తున్నారు.

# కదంబవృక్షం

విష్ణువాహనమైన గరుడుడు స్వర్గం నుంచి అమృత కలశాన్ని ముక్కుతో కరుచుకుని భూమికితెస్తూ, దారిలో విశ్రాంతి కోసం ఒక కదంబవృక్షం నీడలో ఆగాడు. అప్పుడు ఆయన తన ముక్కును కదంబ వృక్షం బోదెకు రుద్దుకోవడంతో కలశం నుంచి కొద్దిగా అమృతం దానిమీద ఒలికిందట. కదంబ వృక్షం సుదీర్ఘకాలం అంటే-దాదాపు మూడువందల సంవత్సరాల వరకు బతకడానికి ఇదొక కారణం అని మన పురాణాలు పేర్కొంటాయి.

సువాసనలు వెదజల్లే కదంబ పుష్పాలంటే బాలకృష్ణుడికి చాలా ఇష్టమట. ఆయన బృందా వనంలో వేణువు వాయిస్తూ, కదంబవృక్షాల నీడలో గోపికలతో విహరించేవాడట.

రుతుపవనాలకు ముందే కదంబవృక్షం పూతకు వస్తుంది. బంగారు బంతుల్లాగా దృఢమైన ఒక తొడిమకు నాలుగయిదు పువ్వులు పూస్తాయి. ఆకులు ముదురు పచ్చ రంగులో వెడల్పుగా ఉంటాయి.

సముద్ర తీరాలలోనూ దిగువ హిమాలయ ప్రాంత మైదానాలలోనూ ఈ కదంబ వృక్షాలు ఎక్కువగాకనిపిస్తాయి. సంస్కృతం హిందీ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ భాషలలో దీనిని కదంబ అంటారు. కన్నడంలో కదవాలా అనీ, **మలయాళంలో అత్తుటేక్ అనీ తమిళంలో వెళ్ళయ్ అనీ అంటారు.**

కదంబవృక్షానికి సంబంధించిన మరొక కథ కూడా ఉన్నది: ఒక వ్యాపారి ఇంటి ఆవరణలో ఒక కదంబవృక్షం ఉండేది. ఆయనకు ఏడుగురు కొడుకులు. చిన్న కొడుకు ఎప్పుడూ ఆ చెట్టు కింద కూర్చుని వేణువు ఊదుతూ కాలం గడిపే వాడు. తండ్రి వ్యాపార నిమిత్తం దూరప్రాంతా లకు వెళ్ళినప్పుడు, తమ్ముడి మీది కోపంతో, అన్నలు కదంబవృక్షాన్ని నరికి పడగొట్టారు. తమ్ముడు వేణువును ఊదుకుంటూ దావులనున్న అడవిలోకి వెళ్ళిపోయాడు. తండ్రి వచ్చి, జరిగిన దానికి బాధపడ్డాడు. పైగా క్రమంగా వాళ్ళ సంపద క్షీణించ సాగింది. వ్యాపారికి, ఇలువేల్పు కలలో కనిపించి, చిన్నకొడుకు వస్తే అదృష్టం తిరిగి వస్తుందని చెప్పింది. తండ్రి వెళ్ళి చిన్నకొడుకును వెదికి తీసుకు వచ్చాడు. చిన్నవాడు వచ్చి వేణువు ఊదడంతో కదంబవృక్షం చిగురించింది. వ్యాపారి కుటుంబం మళ్ళీ సిరిసంపదలతో కళకళలాడింది.



మనదేశపు ఋషులు:

# జాబాలసత్యకాముడు

అరణ్యం గుండా ఒక నది ప్రవహిస్తూ ఉండేది. ఆ నదికి పడమటి తీరంలో గౌతమముని ఆశ్రమం ఉండేది. ఆ ఆశ్రమంలో గౌతమముని పలువురు శిష్యులను చేరదీసి విద్యాబుద్ధులు నేర్పుతూ ఉండేవాడు. విద్యనభ్యసించడానికి దూర ప్రాంతాల నుంచి కూడా శిష్యులు వచ్చి గురుకుల వాసం చేసేవారు.

శిష్యులు రోజూ సూర్యోదయానికి ముందే నిద్ర లేచి, స్నానాదులు ముగించుకుని సూర్యనమస్కారం చేసి, గురువుతో కలిసి ఏకాగ్ర చిత్తంతో వేదమంత్రాలు వల్లించేవారు.

నదికి తూర్పుతీరం నుంచి, ఆ దృశ్యాన్ని ఒక పసివాడు చూసేవాడు. అతడి పేరు సత్యకాముడు. వాడు తన తల్లి జాబాలతో పాటు అక్కడున్న గుడిసెలో ఉండేవాడు. జాబాల అడవిలో ఎండుకట్టెలు ఏరి, దాపులనున్న గ్రామాలకు వెళ్ళి వాటిని అమ్ముకుని పొట్టపోసుకునేది.

ఒకనాడు సత్యకాముడు నదికి స్నానానికి వచ్చి, అవలి గట్టున ఆశ్రమంలో శిష్యులు చదువుకుంటూన్న దృశ్యం చూసి, ఇంటికి వెళ్ళి తల్లితో, "అమ్మా! నాకూ ఆ పిల్లలతో కలిసి చదువుకోవాలని ఆశగా ఉన్నది. ఏం చేయమంటావు?" అని అడిగాడు.

"వెళ్ళి, ఆ మునినే అడుగు నాయనా," అన్నది జాబాల. మరునాడు సత్యకాముడు నదిని ఈదుకుంటూ అవతలి గట్టుకు



చేరుకుని, ఆశ్రమంలోని మునికి నమస్కరించి, "అయ్యా! నన్ను మీ శిష్యుడిగా స్వీకరించి విద్య నేర్పించండి!" అని ప్రార్థించాడు.

"నీ కుల గోత్రాలేమిటి నాయనా?" అని అడిగాడు ముని.

"నాకు తెలియదు స్వామీ," అన్నాడు సత్యకాముడు.

"నీ తండ్రి పేరేమిటి?" అని అడిగాడు ముని.

"అది కూడా తెలియదు. నేను మా తల్లి దగ్గరే ఉంటున్నాను. తండ్రిని ఎప్పుడూ చూడలేదు," అని సమాధానం ఇచ్చాడు సత్యకాముడు.

"అలా అయితే, నువ్వు మీ తల్లి దగ్గరికి వెళ్ళి, నీ తండ్రి ఎవరో తెలుసుకుని రా," అన్నాడు ముని.

సత్యకాముడు ఇంటికి వెళ్ళి, తల్లిని అదే ప్రశ్న అడిగాడు. జాబాల ఒక్క నిమిషం మౌనం వహించి, "నాయనా! నేను నిన్ను కనడానికి ముందు పలువురి ఇళ్ళల్లో పరిచారికగా పని చేశాను. ఆ విధంగా ఒకచోట పని చేస్తున్నపుడు, ఆ ఇంట్లో నాలాగే పనిచేసే ఒక పురుషుణ్ణి పెళ్ళాడాను. వివాహమైన వెంటనే దురదృష్టవశాత్తు యజమాని కుటుంబంతో సహా ఆయన ఒక ప్రమాదంలో మరణించాడు. నేను ఆ ఊరు వదిలిపెట్టి వచ్చేశాను. నువ్వు ఇక్కడే పుట్టావు. నేను నా భర్త పేరు తెలుసుకునే అవకాశమే లేకుండా పోయింది," అని చెప్పింది.



సత్యకాముడు అక్కడి నుంచి ముని ఆశ్రమానికి తిరిగి వచ్చి, తల్లి చెప్పిన విషయం దాపరికం లేకుండా మునికి చెప్పాడు. అంతా విన్న గౌతమముని చిన్నగా నవ్వి, "ఎల్లవేళలా సత్యం పలికేవాడే నిజమైన బ్రాహ్మణుడు. సత్యమే చెప్పావు గనుక నువ్వు బ్రాహ్మణుడివే!" అని ఆశీర్వదించాడు.

జాబాలసత్యకాముడు, ముని వద్ద వేదవిద్య నభ్యసించి ఉత్తమ శిష్యుడుగా, ఉత్తరోత్తరా తనే ఒక గొప్ప గురువుగా పేరు గాంచాడు.

వేదకాలంలో జన్మను బట్టి కాకుండా గుణగణాలను బట్టే మనిషి కులాన్ని నిర్ణయించేవారని సత్యకాముడి కథ ద్వారా తెలుస్తున్నది.

# మీకు తెలుసా?

1. నమీబియా పూర్వనామం ఏమిటి?
2. క్రీ॥శ॥ 50వ సం॥ ప్రాంతంలో క్రైస్తవమతాన్ని మన దేశంలో ప్రచారం చేసిన వారెవరు?
3. చరిత్ర ప్రసిద్ధి గాంచిన ఈజిప్టురాణి క్లియోపాత్రా ఈజిప్టు జాతీయురాలు కాదు; మరి ఏ జాతీయురాలు?
4. బాడ్మింటన్ తొలుత మన దేశంలో ఆడేప్పుడు దానికి వేరొక పేరు ఉండేది. అది ఏమిటి?
5. యూదుల పవిత్ర గ్రంథం ఏది?
6. మన దేశంలో మొదట ఏర్పాటు చేసిన పోలోక్లబ్ పేరేమిటి? ఎప్పుడు ఏర్పాటు చేశారు?
7. రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభమయినప్పుడు ఇటలీ నియంత ఎవరు?
8. క్రీడలలో ప్రావీణ్యత సాధించిన వ్యక్తులకు మనదేశంలో ఇచ్చే అవార్డు ఏది?
9. ప్రప్రథమంగా 'ఒలింపియాడ్' ఎక్కడ జరిగింది? ఆధునిక ఒలింపిక్ క్రీడలు మొట్టమొదటి సారిగా ఎక్కడ జరిగాయి?
10. నశించిపోతూన్న సన్తన జంతువులు మనదేశంలో ఏ ప్రాంతంలో ఉన్నాయి?
11. రంగులన్నింటికీ ఆధారమైన మూడు రంగులు ఏవి?
12. ప్రజల చేత 'మానవజాతి సంరక్షకుడు' అని కీర్తించబడిన మొగల్ చక్రవర్తి ఎవరు?
13. భూమినుంచి వెళ్ళిన మనుషులు అంతరిక్షంలో మొట్టమొదట ఎప్పుడు సమావేశం జరిపారు?
14. సుప్రసిద్ధ రష్యన్ రచయిత కౌంట్ లియో టాల్‌స్టాయ్ జన్మస్థానం ఏది?
15. ఒకేరోజు అంటే – 1826, జూలై 4వ తేదీన మరణించిన ఇద్దరు అమెరికా అధ్యక్షులు ఎవరు?
16. మన దేశంలో రాష్ట్రాల పునర్విభజన ఏ సంవత్సరంలో జరిగింది?
17. యూరపులోని అతి పొడవైన నది ఏది?
18. రైలుపెట్టెలు తయారుచేసే 'ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ' ఎక్కడ ఉన్నది?

## సమాధానాలు

1. నైరుతి ఆఫ్రికా.
2. సెయింట్ థామస్.
3. గ్రీసులోని మేసిడోనియా.
4. పూనా.
5. టోరా.
6. అస్సాంలోని కాచర్ క్లబ్.
7. బెనిటో ముసోలినీ.
8. అర్జున అవార్డు.
9. మొదటి ఒలింపియాడ్ క్రీ॥పూ॥ 776. ఆధునిక ఒలింపిక్ క్రీడలు ఏథెన్స్‌లో 1896వ సం॥లో.
10. హిమాలయ ప్రాంతంలో.
11. ఎరుపు, నీలం, పసుపుపచ్చ.
12. అక్బర్.
13. 1965 డిసెంబర్ 15.
14. యాస్నాయా పోలియానా.
15. జాన్ ఆడమ్స్, థామస్ జాఫర్సన్.
16. 1956.
17. ఓల్గానది.
18. మద్రాసులోని పెరంబూరులో.



# మహావీరుడి మంకుతనం

ఉత్పల దేశానికి కీర్తిచంద్రుడు రాజు. ఆయన కుమార్తె పద్మావతి అందాల భరిణె. యుక్తవయసు రాగానే రాజు ఆమెకు తగిన వరుణ్ణి అన్వేషించసాగాడు. ఆ ప్రయత్నాలలా సాగుతూండగానే ఒకరాత్రి యువరాణి మాయమయింది.

సేవకులు, పరిచారకులు అంతఃపురం నలుమూలలా వెదికారు. రాకుమార్తె కనబడలేదు. అప్పుడు రాజపురోహితుడు అంజనం వేసి చూసి, "యువరాణి పద్మావతిని బ్రహ్మరాక్షసుడొకడు ఎత్తుకు పోయాడు. వాడు భయంకరారణ్యం మధ్యలో దుర్భేద్యమయిన భవనంలో ఉంటున్నాడు. వాడు మహా శక్తిమంతుడు. ఈ రోజునుంచి సరిగ్గా మూడు మాసాల తరవాత వాడు పద్మావతిని పెళ్ళి చేసుకోబోతున్నాడు," అని చెప్పాడు.

ఇది విని రాజు, రాణి హతాశులైపోయారు. ఏం చేయాలో వారికి పాలుపోలేదు. మహామంత్రి పురోహితుడితో, "ఆర్యా! రాకుమారిని తిరిగి దక్కించుకునే మార్గం కూడా అంజనం వేసి చూడండి," అన్నాడు.

పురోహితుడు తల అడ్డంగా తిప్పి, "జరిగినదీ, జరుగుతున్నదీ మాత్రమే అంజనం ద్వారా చూడగలను. రాక్షసుడు పద్మావతితో వివాహం గురించి మాట్లాడాడు కాబట్టి, జరగబోయే పెళ్ళి గురించి నాకు తెలిసింది. అదలా ఉంచితే – మళ్ళీ మూడు మాసాల వరకూ అంజనం వేయడం కుదరదు," అని చెప్పాడు.

ఇది విని మంత్రి, రాజు వంక తిరిగి, "ప్రభూ! దిగులుపడి మనం చేయగలిగింది లేదు. అంతా మన మేలు కొరకే అని సరిపెట్టు కుందాం. రాకుమార్తెను రాక్షసుడి బారి నుంచి రక్షించినవాడికి, ఆమెనిచ్చి వివాహం చేస్తానని ప్రకటించండి. ఆపైన దైవం మీద భారం వేద్దాం," అని సలహా ఇచ్చాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



డనేవాడు అందరికంటే ముందుగా చేరుకు న్నాడు. అక్కడికి ఏ వీరుడొచ్చినా వాడు సవాలు చేసి, "బ్రహ్మరాక్షసుడి నెదుర్కోవడం సామా న్యులకు సాధ్యం కాదు. ముందు నన్నో డించి తర్వాత అరణ్యంలో ప్రవేశించండి," అనసాగాడు.

ఒక్క వీరుడు కూడా మహావీరుణ్ణి ఎదిరించి ముందుకెళ్ళలేక పోయేవాడు. క్రమంగా భయంకరారణ్యం వైపు వచ్చే వీరుల సంఖ్య తగ్గిపోయింది.

చారుల ద్వారా ఈ వార్త రాజును చేరింది. మహావీరుడి గురించి వాకబు చేయగా, వాడి తండ్రి పూర్వం సైన్యంలో పనిచేసి మరణిం చాడనీ, ఆ తర్వాత వాడు కొంత కాలం పాటు దేశం విడిచిపెట్టి ఎక్కడెక్కడికో వెళ్ళి, ఎన్నో విద్యలు నేర్చి మహాశక్తి మంతుడై వచ్చాడనీ తెలిసింది. కీర్తిచంద్రుడు మహావీరుడి తల్లిని స్వయంగా చూడ బోయాడు. ఆమె మహారాజు తన ఇంటికి వచ్చినందుకు తత్తరపడింది.

"నీ కుమారుడు రాజద్రోహం చేస్తున్నాడు. అందుకు సరైన కారణం ఉంటే తెలుసుకుం దామని వచ్చాను," అన్నాడు కీర్తిచంద్రుడు గంభీరంగా.

"ప్రభూ! మాది రాజభక్తుల వంశం. రాజ ద్రోహం మాట అటుంచండి. రాజవంశం గురించి ప్రాణాలైనా ఇవ్వగలం. మీ ఆరోపణ నిజం కాదు," అన్నది మహావీరుడితల్లి.

కీర్తిచంద్రుడికి ఈ సలహా నచ్చింది. ఆ ప్రకారం ఆయన వెంటనే రాజ్యం అంతటా, "భయంకరారణ్యం మధ్యలో ఉండే రాక్ష సుడు, రాకుమార్తెను ఎత్తుకు పోయాడు. మూడు మాసాలలో వాడామెను పెళ్ళి చేసుకుంటాడు. ఈలోగా రాకుమార్తెను రక్షించి తీసుకొచ్చిన వారికి, ఆమెనిచ్చి వివాహం చేయడం జరుగుతుంది," అని చాటింపు వేయించాడు. అది విని రాజ్యం లోని వీర యువకులెందరో ఉత్సాహంగా, భయంకరారణ్యం వైపు తరలి వెళ్ళారు.

భయంకరారణ్యం దుర్గమమైనది. అందులో ప్రవేశించాలంటే ఒకే ఒక్క మార్గమున్నది. అక్కడకు ఉత్పల దేశానికే చెందిన మహావీరు

రాజు ఈ జవాబుకు ఏమాత్రం తృప్తి పడక, "అయితే భయంకరారణ్యంలోని బ్రహ్మారాక్షసుణ్ణి ఎదుర్కొనేందుకు వెళ్ళే వీరులందర్నీ మహావీరుడెందుకు ఆపుతున్నట్టు?" అని అడిగాడు.

ఇది వింటూనే మహావీరుడి తల్లి ఎంతగానో ఆశ్చర్యపోతూ, "ప్రభూ! నా కుమారుడు మహాశక్తిమంతుడు. వాడినెదిరించగల శక్తి ఈ భూమ్మీద లేదు. ఎక్కడెక్కడో తిరిగి మహాశక్తులన్నీ సాధించుకున్నాడు. బ్రహ్మరాక్షసుడినెదిరించడానికి నా దీవెనలు కావాలని వాడు నా దగ్గరకు వచ్చాడు. నేను వాడిని దీవించి పంపాను. మీ మాటలు నా కాశ్చర్యం కలిగిస్తున్నవి," అన్నది.




కీర్తిచంద్రుడి కామె మాటల్లో నిజాయితీ కనబడింది. ఆయన రాజభవనం చేరి మంత్రితో మంతనాలు జరిపాడు.

మంత్రి కొద్దిసేపు ఆలోచించి, "ఇంత వరకూ మన రాజ్యంలో ఏ వీరుడూ, మహావీరుణ్ణి జయించలేకపోయాడు. పేరుకు తగ్గట్టే అతడు మహావీరుడు. మనం అతడి నొకసారి స్వయంగాకలుసుకోవడం అవసరం. అయితే ఇలా కాదు, మారువేషాలతో వెళదాం," అన్నాడు.

రాజూ, మంత్రీ పల్లెటూరి పేదరైతుల్లా వేషాలు వేసుకుని భయంకరారణ్యం ముఖద్వారం వద్దకు వెళ్ళారు. అక్కడ మహావీరుడు వారికి అరివీర భయంకరుడిలా కనిపించాడు.

రాజు వాణ్ణి పలకరించి, "బాబూ! నువ్వి క్కడేంచేస్తున్నావు?" అని ప్రశ్నించాడు.

"ఉత్పల వీరుల్ని పరీక్షిస్తున్నాను," అన్నాడు మహావీరుడు.

"ఆ పని రాజు చేస్తాడు, సైన్యాధిపతి చేస్తాడు. ఉత్పల వీరుల్ని పరీక్షించాల్సిన అవసరం నీకెందుకు?" అన్నాడు రాజు.

దానికి మహావీరుడు తడువుకోకుండా, "ఈ అరణ్యం మధ్యలో ఒక బ్రహ్మారాక్షసుడున్నాడు. వాడు మహా శక్తిమంతుడు. వాణ్ణి చంపడం సామాన్యులకు సాధ్యపడదు. తన మీదికి వచ్చిన వారిని వాడు చంపి తినేస్తాడు. ఉత్పల వీరుల్ని నేను చావు నుంచి కాపాడుతున్నాను," అన్నాడు.



"ఒకవేళ ఆ వీరులు బ్రహ్మరాక్షసుణ్ణి చంపగలరేమో! వాడి చేతిలో చచ్చిపోతారని నీవెలా చెప్పగలవు?" అన్నాడు రాజు.

ఇందుకు మహావీరుడు చిన్నగా నవ్వి, "లోకజ్ఞానమున్న వాడెవడికైనా అమాత్రం తెలుస్తుంది. నన్నే ఓడించలేనివాళ్ళు బ్రహ్మరాక్షసుణ్ణేం చేయగలరు?" అన్నాడు.

రాజు అవునన్నట్టు తలాడించి, "అది సరే! అయితే, బ్రహ్మరాక్షసుణ్ణి ఓడించగల వారు మన రాజ్యంలో లేరా?" అన్నాడు.

"ఎందుకు లేరు? వాడిని నేనే ఓడించ గలను," అన్నాడు మహావీరుడు.

"అయితే ఇంకేం - నువ్వే వెళ్ళి వాడిని ఓడించవచ్చు గదా! ఇలా ఇక్కడ ముఖద్వారంలో నిలబడి అందర్నీ అడ్డగించడం వల్ల ఏం ప్రయోజనం?" అని అడిగాడు రాజు.

"ఆ పని చేసేవాణ్ణే మరి - కానీ నాకు మన మహారాజు కారణంగా పెద్ద ఇబ్బంది వచ్చి పడింది!" అంటూ మహావీరుడు తన కథను వారికి చెప్పసాగాడు:

మహావీరుడితండ్రి చండసేనుడు యుద్ధంలో మరణించినప్పుడు వాడి వయసు అయి దేళ్ళు. తల్లి వాడితో ప్రతిరోజూ తండ్రి పరాక్రమం గురించి చెప్పి, "అంతటివాడూ యుద్ధంలో దిక్కుమాలిన చావు చచ్చాడు. నువ్వు యుద్ధంలో చావు లేకుండా ఉండేంత శక్తిమంతుడివి కావాలి!" అంటూండేది.

ఈ మాటలు మహావీరుడి తలకెక్కాయి. చిన్నతనం నుంచే వాడు యుద్ధవిద్యలభ్య సించి రాటుదేలాడు. పదహారేళ్ళ వయసులో వాడు తల్లితో, "అమ్మా! నేను హిమాలయాలకు వెళ్ళి, అక్కడి మునుల సేవ చేసుకుని మంత్ర తంత్రాలు నేర్చుకుని వస్తాను, దీవించు!" అని తల్లి దీవెనలందుకుని బయల్దేరి వెళ్ళాడు.

హిమాలయాల్లో మహావీరుడి కోర్కె సిద్ధించింది. అక్కడ ఒక ముని వాడికి మంత్ర తంత్రాలన్నీ నేర్పి, "నాయనా! ఈ భూమ్మీద నిన్నెదిరించగల శక్తి లేదు. మొదటిసారిగా మానవేతర శక్తి నెదిరించడానికి వెళ్ళేముందు మాత్రం, నీ తల్లి దీవెనలందుకో! ఆ తరవాత నీకెదురుండదు," అన్నాడు.

తిరుగుప్రయాణంలో మహావీరుడికి దొంగ లముఠా ఒకటి ఎదురయింది. సమీపంలోని పల్లెటూళ్ళో చంద్రిక అనే ఒక అందమైన పిల్ల ఉన్నది. దొంగల నాయకుడు ఆమె అంటే మోజు పడ్డాడు. తను పెళ్ళాడేందుకు ఆ పిల్లనీ, పెళ్ళి జరిపించడానికి పురోహితుణ్ణీ, కన్యాదానం చేయడానికి పిల్ల తల్లిదండ్రుల్నీ బందీలుగా తీసుకుపోతున్నారు దొంగల ముఠా. వాళ్ళు మొత్తం ఇరవై మంది ఉన్నారు. మహావీరుడు వాళ్ళందర్నీ ఎదిరించి తరిమేశాడు.

అప్పుడు చంద్రిక తండ్రి, మహావీరుడితో, "నాయనా! పెళ్ళి కోసం ఇల్లు కదిలిన క్షణంలోనే మా పిల్ల మాకు పరాయిదయింది. దానికి పెళ్ళి జరిపించకుండా పల్లెకు తిరిగి వెళ్ళి ఎవరికీ ముఖం చూపించలేం. మేము కన్యాదానం చేస్తాం. పురోహితుడు పెళ్ళి జరిపిస్తాడు. నువ్వు చంద్రికను స్వీకరించు!" అని వేడుకున్నాడు.

చంద్రిక కూడా తనంటే ఇష్టపడుతున్నదని గ్రహించాక మహావీరుడు పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళయ్యాక భార్యాభర్తలు ఉత్పలదేశానికి బయల్దేరారు. దారిలో వాళ్ళకు బ్రహ్మరాక్షసుడొకడు తటస్థపడి, "ఆహా. ఈ అందాల కుప్ప నాకు మహా నచ్చింది. నేనీమెను భయంకరారణ్యంలోని, నా నివాసానికి తీసుకు వెళుతున్నాను. చేతనైతే నన్నాపు!" అన్నాడు.

తల్లి దీవెన లేకుండా తొలిసారి మానవేతర శక్తితో తలపడ వద్దన్న ముని హెచ్చరిక గుర్తు



రావడంతో, మహావీరుడు తడబడి, "నేను నిన్ను ఎదిరిస్తాను. ఎటొచ్చీ కొంత గడువు కావాలి!" అన్నాడు.

ఇందుకు రాక్షసుడు వికవికమంటూ నవ్వి కాళ్ళతో భూమిని తాటిస్తూ, "త్వరలో నేను ఒకే రోజున ఎనిమిది మంది మానవ యువతులను పెళ్ళాడబోతున్నాను. ఆలోగా రాగలిగితే రా!" అని చంద్రికను తీసుకుని మాయమయ్యాడు.

తర్వాత మహావీరుడు ఉత్పలదేశం చేరుకుని, కంగారు పడుతుందని తల్లికి వివాహ విషయం చెప్పకుండా బ్రహ్మరాక్షసుడి నెదిరించడానికి దీవెనలడిగి బయలుదేరాడు. ఆ సమయంలోనే వాడు రాజు చాటింపు విని ఇరకాటంలో పడ్డాడు.

"ఇందులో ఇరకాటమేముంది. నువ్వు కోరిందే రాజు కోరాడు కదా?" అన్నాడురాజు.

"బ్రహ్మరాక్షసుణ్ణి చంపినవాడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళి చేస్తానంటున్నాడు రాజు. నాకిప్పటికే వివాహమైంది. అపైన నేను ఏకపత్నీవ్రతుణ్ణి!" అన్నాడు మహావీరుడు.

రాజు వాడి నిజాయితీకీ, నిష్కపటత్వానికీ ఆశ్చర్యపడుతూనే, "ఈ మాత్రం దానికే మంకుతనం ఎందుకు? ఈ విషయం రాజుకు చెబితే, ఆయనే ఏదో ఏర్పాటు చేసేవాడు కదా!" అన్నాడు.

"ఏమో! ఉత్పలదేశంలో నన్ను మించిన వీరులెవరైనా ఉంటే, వారు రాజకుమార్తెను రక్షించగలరేమో చూద్దామని ఆశ పడ్డాను," అన్నాడు మహావీరుడు.

రాజు వాడి వినయగుణానికి మరింత అబ్బురపడి, తానెవరైందీ చెప్పాడు. తర్వాత రాజు తన చాటింపును సవరించి, రాజకుమార్తెను రక్షించినవాడు, ఆమెను వివాహం చేసుకోవాలన్న నిర్బంధం లేదనీ, అతడికి కోరినదివ్వగలననీ ప్రకటించాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే మహావీరుడు, బ్రహ్మరాక్షసుణ్ణి సునాయాసంగా చంపి, తన భార్యను దక్కించుకున్నాడు. యువరాణిని రక్షించాడు. ఇందుకు రాజు కీర్తిచంద్రుడు ఎంతో సంతోషించి మహావీరుడికి తన సైన్యంలో ఉన్నత పదవినిచ్చి గౌరవించాడు.





# రామనాథం తెలివి

చంచలపురానికి సమీపంలో వజ్రాలగని ఉన్నట్లు తెలిసింది. ఎక్కడెక్కడి వజ్రనిపుణులూ చంచలపురం చేరుకోసాగారు. అంతేగాక, గనిలో పనిచేసే శ్రామికులు, వజ్రాల కోతలో సమర్థులూ అయిన ఎంతోమంది కూడా చంచలపురానికి వచ్చి, స్థిరనివాసమేర్పరుచుకున్నారు. దాంతో చంచలపురంలో ఇళ్ళ కొరత ఏర్పడింది.

ఇలాంటి పరిస్థితుల్లో రామనాథం ఆ వూరొచ్చాడు. అద్దెఇంటి కోసం కాళ్ళరిగేలా తిరగ్గా తిరగ్గా ఒక ఇల్లు ఖాళీగా ఉన్నట్లు తెలిసింది. ఆ ఇంటి యజమాని అయిదు వందల రూపాయలు అద్దె ఇవ్వాలనీ, ఏడాది కాగానే ఇల్లు ఖాళీ చేయాలనీ షరతుపెట్టాడు. రామనాథానికి ఈ షరతు నచ్చింది కాదు. ఏదో ఇంట్లో ఉంటూ నెల నెలా బకాయి పడకుండా అద్దె చెల్లిస్తుంటాం అనుకున్నాడు. కానీ, ఇంటి యజమాని ఏడాది కాగానే ఇల్లు ఖాళీ చేయాలనే షరతు పెడతాడని అతడు ఊహించలేదు.

"నాకు మా ఊళ్ళో రెండిళ్ళున్నవి. వాటిలో ఒకదాన్ని అద్దెకిస్తుంటాం. అయితే మీలాగా ఇలాంటి షరతులు పెట్టం. ఇది అన్యాయం. అయినా మాట వరసకడుగుతాను- ఏడాది తరవాత నేనిల్లు ఖాళీ చేయకపోతే ఏం చేస్తారు?" అన్నాడు రామనాథం.

"ఇందులో అన్యాయం ఏమీ లేదు. ఇల్లు నాకెప్పుడు అవసరమవుతుందో తెలియదు కదా! నేను చాలా పెద్ద కుటుంబీకుణ్ణి. ఇక్కడ వజ్రాల గని ఉన్నట్లు వార్త తెలిసి పట్నంలో ఏదో చిన్న వ్యాపారం చేసుకుంటున్న నా పెద్దల్లుడు, సకుటుంబంగా ఇక్కడకు రావాలనే ప్రయత్నంలో ఉన్నట్టు తెలిసింది. అందుకని ముందుగా ఒప్పందం లేకపోతే, అడిగినప్పుడు ఇంట్లో అద్దెకున్న వాళ్ళు ఖాళీ చెయ్యరు. మనమిప్పుడే

శ్రీరామకమల్



ఒప్పందం రాసుకుందాం. ఆ ప్రకారం ఏడాది తర్వాత నువ్విల్లు ఖాళీ చేయకపోతే, నెలకు రెండువేలు చొప్పున అద్దె కట్టవలసి ఉంటుంది," అన్నాడు గుర్నాథం.

దానికి రామనాథం కాస్త కోపంగా, "మీరు చెప్పేదాన్ని బట్టి మీ పెద్దల్లుడు ఏడాదిలోగా ఇక్కడికి రాడు. ఒకవేళ ఆయన ముందుగా వచ్చే మాట నిజమైతే ఈ ఇంట్లో ఏడాది వరకూ నేనుండేందుకు మీరు ఒప్పందం రాసుకో డానికి ఒప్పుకోరు కదా! ఏడాది తరవాత మీకు ఇల్లు అవసరం లేదనుకోండి- అప్పుడు మళ్ళీ నాకే అద్దెకివ్వరా?" అని అడిగాడు.

"మహదానందంగా ఇస్తాను! అప్పుడు మళ్ళీ కొత్త ఒప్పందం రాసుకుందాం. సరేనా?" అన్నాడు గుర్నాథం. ఆ ప్రకారం రామనాథం గుర్నాథం ఒప్పందం రాసుకున్నారు.

తర్వాత రామనాథం భార్యాపిల్లలతో ఆ ఇంట్లో దిగాడు. పదకొండు మాసాలు సుఖంగా గడిచిపోయాయి.

తర్వాత ఒకనాడు గుర్నాథం, రామనాథాన్ని చూడొచ్చి, "నువ్వు నెలనెలా అద్దె సక్రమంగా చెల్లిస్తున్నావు. నాకు చాలా సంతోషంగా ఉంది," అన్నాడు.

"ఇంత మంచి ఇల్లు అద్దెకు దొరకడం నాకూ సంతోషంగా ఉంది. పుట్టి పెరిగిన ఊరి మాట మరిచిపోయి ఎంతకాలమైనా ఇక్కడే గడపాలనిపిస్తున్నది," అన్నాడు రామనాథం.

ఈ జవాబుతో గుర్నాథం ఉలిక్కిపడి, "అదేమిటి? మన ఒప్పందం మాట మరి చావా?" అన్నాడు.

"ఏం మరవలేదు. మీరు పెట్టిన షరతులు నాకు గుర్తే. మీకేమైనా ఇంటి అవసరం కలిగిందా? పట్నం నుంచి మీ పెద్దల్లుడు ఇక్కడకువచ్చి ఉండబోతున్నాడా?" అని అడి గాడు రామనాథం ఆదుర్దాగా.

"అదేం లేదు. వచ్చే నెల నుంచి ఇంటి అద్దె ఆరువందలు చేస్తున్నాను. నీకిష్టమైతే కొత్త ఒప్పందం రాసుకుందాం. లేకుంటే, ఈ నెలాఖరుకి ఖాళీచెయ్యి," అన్నాడు.

గుర్నాథం ఇలా అనగానే రామనాథం నెత్తిన పిడుగుపడ్డవాడిలా, ఒక క్షణంపాటు

నిశ్చేష్టుడైపోయి, అంతలోనే తేరుకుని, "ఇది పచ్చి దురన్యాయం. ఏడాదిలో వంద రూపాయలు పెంచడమా! ఒక పాతిక రూపాయలు పెంచండి. లోకంలో న్యాయం ఇంకా కొన ఊపిరితో ఉన్నదనయినా గుర్తించినట్లవుతుంది. నా మాట కాదంటే- అద్దె తగ్గించడానికి నేను చేయవలసింది చేస్తాను," అన్నాడు.

ఇది వింటూనే గుర్నాథం కోపంగా, "నేను చెప్పాల్సింది చెప్పాను. ఆ పైన మీ ఇష్టం," అని అక్కణ్ణించి విసురుగా వెళ్ళి పోయాడు.

ఈ సంభాషణ విన్న రామనాథం భార్య, "ఎందుకొచ్చిన గొడవ? ఈ ఊళ్ళో ఇళ్ళ కొరత ఎక్కువగా ఉంది. అద్దె తగ్గించ డానికి మీరేమీ చేయలేరు. కాబట్టి కొత్త ఒప్పందం రాయించడం మంచిది," అన్నది భర్తతో.

గుర్నాథం తన మాట మీద నిలబడ్డాడు. రామనాథం ఇల్లు ఖాళీ చేయలేదు. ఏడాది మీద నెలరోజులు అదనంగా ఉండి- అదనపు నెలకు రెండువేల రూపాయలు అద్దె చెల్లించాడు. ఆ తర్వాత కొత్త ఒప్పందం రాసుకుని, అప్పటినుంచి ప్రతి నెలా ఆరు వందలు అద్దె కడుతూ వచ్చాడు.

"ఆ రాసే ఒప్పందమేదో నెల ముందు రాస్తే సరిపోయేది కదా! ఉత్త పుణ్యానికి ఒక నెలకు పధ్నాలుగొందలు అదనంగా ఇచ్చారు కదా!" అని వాపోయింది రామనాథంభార్య.

రామనాథం భార్య మాటలకు పెద్దగా నవ్వి, "వెర్రిదానా! నా తెలివి నీకు అర్థం కాలేదు. ముందే ఒప్పందం రాశాననుకో, అప్పుడు గుర్నాథానికి ఇంటద్దె వలన వందరూపాయలు ఆదాయం పెరిగినట్లు. నెల్లాళ్ళాగి రాశాను కదా! అందువల్ల గుర్నాథం ఆదాయం రెండువేల నుంచి, ఆరువందలకు పడిపోయింది. తనకు పధ్నాలుగొందల రూపా యల మేరకు ఆదాయం తగ్గిపోయిందని గుర్నాథం కుమిలి పోవాలనే అలా చేశాను," అన్నాడు.

భర్త తెలివికి నవ్వాలో, ఏడ్వాలో తెలియలేదు రామనాథంభార్యకు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 మే నెల సంచికలో ప్రకటింపబడును.


Tajy Prasad


Aruna Nistala

✱పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✱ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✱మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✱వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : బసవన్నే నాకు తోడు!

రెండవ ఫోటో : బరువంటే మరి లేదు కూడు!

పంపినవారు : సి. శ్రీనివాస్

7/260, యాదవవీధి

రంగనాయకులపేట, నెల్లూరు - 524001.(ఆం.ప్ర)




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.